భారతీయ సాహిత్య నిర్మాతలు

# జీవనానంద దాస్

ఆంగ్లమూలం
చిదానంద దాస్ గుప్త

తెలుగుసేత
కుందుర్తి



సాహిత్య అకాడెమీ
న్యూఢిల్లీ

ఈ కృతి సమర్పిస్తున్నాను

కవితల అనువాదాలు చేయడానికి నన్ను ప్రోత్సహించిన

హుమయూన్ కబీర్

స్మృత్యంజలిగా...

# విషయసూచిక


| | | పుట |
|---|---|---|
| కవి కాలాదులు | ... | 5 |
| జీవనానంద దాస్ వ్యక్తిత్వం | ... | 13 |
| కవిగా జీవనానంద దాస్ | ... | 16 |
| అనువాదాలు | ... | 37 |
| ముఖ్య గ్రంథ సూచిక | ... | 86 |

1

# కవి కాలాదులు

జీవనానంద దాస్ జీవితమంతా రవీంద్రనాథ టాగూరు ప్రతిభా పతాక ఎత్తుగా ఎగురుతున్న కాలంలోనే గడిచింది.

అర్థ శతాబ్దానికి పైగా బెంగాలు ప్రజాజీవన చైతన్యాన్ని రవీంద్రుడు ఎంతగా ఆవరించి, ఆక్రమించి వున్నాడో, ఆయనకు సమకాలీనులై ప్రత్యక్షంగా అనుభవించిన వారికే తెలుస్తుంది. బెంగాల్లో అక్షరజ్ఞానం వున్న ప్రతివాడూ టాగూరు వచన రచన శైలినీ, ఆయన దస్తూరిని కూడా అనుకరించాడు; టాగూరు రాసిన సుమారు 2 వేల పాటల్లో కనీసం 5 వందలైనా చదివి వుంటాడు; బడిలోనో, కాలేజీలోనో టాగూరు రాసిన నాటకాల్లో ఎప్పుడో ఒకప్పుడు ఏదో పాత్ర ధరించి వుంటాడు; టాగూరు కవితలు చాలా వరకు కంఠస్థం చేసే వుంటాడు; ఆయన నవలలన్నీ చదివి వుంటాడు; కొన్ని వ్యాసాలు కూడా చూచేవుంటాడు. భారతీయ జీవన విధాన మనోహర దృశ్యమైన శాంతినికేతన్ దర్శించి వుంటాడు. అంతేకాకుండా టాగూరు జీవన సరళిని జీర్ణం చేసుకుని, తన జీవితంలో ప్రతి చోటా దానిని అనుసరిస్తూ వుంటాడు. టాగూరు తన కాలంలో బెంగాలు ప్రజానీకాన్ని అంతగా ప్రభావితం చేశాడు టాగూరు తరువాత అనేక తరాల వరకూ, ప్రాక్పశ్చిమ జీవన సిద్ధాంతాలు, పురాతన, అధునాతన భాషాలు, శాస్త్రజ్ఞానం, మత పరమైనవిశ్వాసాల పట్ల ఆయన ప్రదర్శించిన సమన్వయ దృక్పథం అందరినీ ఆవరించింది. ఉదారమైన విశాల మానవ[illegible]

బ్రహ్మసమాజ ప్రేరితమైన సంఘ సంస్కరణ దృష్టి మొదలైన అంశాలు వివిధ వర్గాల ప్రజల మనస్సుల్లో బాగా నాటుకున్నాయి. టాగూరు ప్రసక్తి లేకుండా, ఆయన ఆక్రమించిన భావవలయం దాటి ఆలోచించడమే అసాధ్యమా అనిపించింది. తన జీవితమూ, తన రచనలద్వారా టాగూరు బెంగాలు ప్రజల మనస్సులమీద తరతరాలకూ చెరగని గాఢ ముద్ర వేశాడు. ఆయన గొడుగు క్రింద వుండే అందరూ ఆలోచించవలసిన పరిస్థితి సృష్టించాడు.

టాగూరు అది చేశాడు, యిది చేశాడు అని భూతకాలక్రియ ఉపయోగించి చెప్తుంటే నా కలం రాయడానికి గజగజ వణకి పోతున్నది. ఎందుకంటే టాగూరు సృష్టించిన సాహిత్య సంస్కృతి శక్తి పూర్తిగా గతం అనే కాలగర్భంలో కలిసి పోలేదు. అది యింకా వర్తమానాన్ని ఆశ్రయించుకొని సజీవంగానే వుంది. అయితే టాగూరు మరణానంతరం జన్మించిన వారిలో చాలా మంది యిప్పుడు 30 ఏండ్ల వయస్సులో వుంటారు. బెంగాలులో ప్రస్తుతం ఏర్పడివున్న పరిస్థితుల్లో చాలా మార్పు కనిపిస్తున్నది. కొంచెం వెనుక్కుతిరిగి టాగూరు కాలంలోకి వెళ్ళి చూడవలసిన అవసరం లేనంతగా పరిస్థితుల్లో మార్పు వచ్చింది. ద్వితీయ ప్రపంచ యుద్ధం, నిరుద్యోగ పరిస్థితీ, నానాటికీ కర్కశంగా తయారవుతున్న రాజకీయ సంక్షోభం, స్వాతంత్ర్య ప్రాప్తికి పూర్వం ప్రజలకు వున్న ఆశలూ ఆశయాలు, విలువలూ గాలికి ఎగిరిపోయాయనే భావం-వీటి అన్నిటి వల్లా టాగూరు యుగంలో లాగా ప్రజలకు యీనాడు ఆయనతో పూర్తిగా తన్మయీభావం పొందే అవకాశం తగ్గిపోయింది.

కాస్త చదువూ సంధ్యా అబ్బిన బెంగాలీ వారికి రవీంద్రుని పరిధిలో నుండి బైటపడడం చాలా యిబ్బంది; ముఖ్యంగా ఆయన ప్రభావం పడి ఉక్కిరి బిక్కిరి అయిన బెంగాలీ కవులకు మరీ కష్టం. నిత్య నూతనంగా విజృంభించిన తన భావనా బలంతో ఆయన వారందరినీ ఆశ్చర్య చకితుల్ని చేశాడు 1937 లో టాగూరు "ప్రాంతిక్" అనే కవితా సంపుటిని ప్రకటించాడు. పెద్ద జబ్బుచేసి దాదాపు మరణావస్థనుండి మళ్ళీ తేరుకొని బైటపడిన తర్వాత ఆనాటినుండి టాగూరు సమకాలీన జీవిత సత్యాలకు దర్పణంగా వుండి తన భావచైతన్యాన్ని ప్రజల మనః ఫలకాల మీద దృఢంగా ముద్రిం

చడం మొదలు పెట్టాడు. యుద్ధకారక శక్తులను తీవ్రంగా ఖండించాడు. సమాజంలో చుట్టూ కనిపిస్తున్న దుర్గుణాలనూ, దారుణ పరిస్థితులనూ, ప్రదర్శించి చూపాడు.

బుసకొట్టే సర్పరాజులు విషం కక్కుతున్నాయి
నా చుట్టూ వర్తిస్తున్న గాలిలో....
శక్తి హీనమై పోయాయి శాంతి ప్రవచనాలన్నీ
పెద్ద వాణ్ణయిపోయాను;
పోయే లోగా ప్రజలందరికీ విజ్ఞప్తి
ఈ రక్కసిని తుదముట్టిద్దాం
ఇంటింటా యిందు కోసం
సర్వులూ సన్నద్ధం కావాలి.

"ప్రాంతిక్" — 18 వ పద్యం

నిరంతర శాంతి ప్రవక్తగా పేరు పొందిన ఆ మహనీయుడు శాంతి ప్రవచనాలు శక్తిహీనమై పోయాయని రాయడానికి, పెద్దతనంలో ఆయన హృదయం ఎంతగా వికావికలై వుంటుందో వూహించండి. 1930 దశాబ్దానికి చెందిన తరం కవులందరిలోనూ టాగూరు ప్రభావంనుండి తప్పించుకో వాలనే ఆకాంక్ష, ప్రయత్న పూర్వకమైన కృషీ ప్రారంభమయ్యాయి. ఈ కృషిలో బుద్ధదేవ బోస్ ప్రధాన పాత్ర వహించాడు. టాగూరు మరణానికి ముందు సుమారు 15 సంవత్సరాలపాటు "కల్లోల్" సాహితీ బృందం అదే పేరుతో ఒక సాహిత్య పత్రిక నడుపుతూ కొంత కృషి చేసింది. ఇందులో యుద్ధానంతర కాలంలో నిరాశా నిస్పృహలతో నిండిన ఆంగ్ల కవితామార్గం చేత ప్రభావితులైన వారూ, లేక మార్క్సిస్టు సిద్ధాంత ప్రభావితులైనవారూ, యీ రెండు శక్తుల ప్రభావం కలవారూ కలిసి వుండేవారు. వీరందరూ టాగూరు అనంతరం రానున్న ఆలోచనా రీతులను గురించి అన్వేషణ ప్రారంభించారు. అయితే టాగూరు భావ బంధాల నుండి విముక్తికోసం పోరాటం సల్పింది ఒక్క "కల్లోల్" బృందమే కాదు. టాగూరు జయంతి సందర్భంగా విష్ణు డే అనే కవి యిలా రాశాడు.

టాగూరు చెట్టు పేరుతో కాయలమ్మే గతి
ఇంక మనకు వద్దు
జటా జూటపు మెలికల్లో గంగను యిరికించుకుని
శాశ్వతంగా నిలపడానికి వీల్లేదు
ఆత్మభావ గంగాప్రవాహాన్ని విచ్చలవిడిగా వదుల్తున్నాం
పాటల పడవల మీదెక్కి జలధివైపు కదుల్తున్నాం
కొత్తదారి, కొత్త నడక
కొత్త రంగులు, కొత్త చిత్రాలు
కొత్త గొంతుల కోలాహలంతో
నవ్యకవితా ప్రవాహాలు పారిస్తాం
ప్రజల మనస్సులను పాలిస్తాం,

విష్ణు డే "వైశాఖ 25."

ఇటువంటి వాతావరణంలో కూడా జీవనానంద దాసు టాగూరు మీద ధ్వజమెత్తుతూ కవితా రంగ ప్రవేశం చేయలేదు. ఆయన కవితా వస్తుదర్శనం టాగూరులో వచ్చిన పరిణామ దశల్లోనే ప్రయాణం చేసి బలపడింది. టాగూరు అనంతర కవుల్లో యితరులందరికంటే జీవనానంద దాసులో యీ పరిణామం స్పష్టంగా కనిపిస్తుంది. ఇది ఆయన మనస్సులో పూర్తిగా గ్రహించేవుంటాడు. ఎందుకంటే జీవనానంద దాసు ఒక చోట యిలా రాశాడు.

"తమకంటే ముందున్న మహాకవులను పడద్రోయడానికి కుట్రలు పన్నడం ద్వారా కవులు తమ స్థానాన్ని నిలబెట్టుకోలేరు .. ఎవరో ఒకరిద్దరు కవులు రాసిన కొన్ని కవితలను మినహాయిస్తే, ఆధునిక బెంగాలీ కవితా రంగ మంతటా టాగూరు ప్రభావం అచ్చుగుద్దినట్లు కనిపిస్తూనే వుంటుంది ఆధునిక కవితలను ఆయన కవితతో పోల్చి చూస్తే ఆయనలో ఎంత వైవిధ్యం వుందో తెలుస్తుంది .. ఆయన అడుగుజాడల్లోనే ఆధునిక బెంగాలీ కవిత యిప్పుడే కొత్తగా ప్రయాణం ప్రారంభించింది. (వాక్య ప్రాధాన్య సూచన ఆంగ్ల అనువాదకునిది) ఆధునిక బెంగాలీ కవిత అభివృద్ధి చెందినందువల్ల

బెంగాలీ సాహిత్యంలోని, టాగూరులోని ప్రాతిపదిక విలువలకు ఏ విధం గానూ భంగం కలుగదు."

టాగూరు కవితా సంప్రదాయానికి ఎదురు తిరగకపోవడమే కాకుండా దానిని కొత్త తరంలోని భావాలతో, భాషలోని నుడికారంతో మేళవింపచేసి ముందుకు తీసుకుపోవడంలో జీవనానంద దాసు తన శక్తి సామర్థ్యాలను పుష్కలంగా ప్రదర్శించాడు "సంప్రదాయము—వ్యక్తి ప్రతిభ" అనేపేరుతో టి. ఎస్. ఇలియట్ రాసిన వ్యాసంలో ఆయన నిర్వచించిన విధంగా యీ రెండింటికీ వుండే సంబంధానికి జీవనానంద దాసును ప్రత్యక్ష ఉదా హరణగా పేర్కొనవచ్చు.

బెంగాలీ సాహిత్యం నిండా పశ్చిమ దేశాల భావాల గాలి బలంగా వీస్తున్న రోజులవి. రెండు ప్రపంచ యుద్ధాల ప్రభావంతో చవిటి పర్రగా మారిన భూగోళంమీద వీచిన ఆ గాలి బెంగాలుకు కూడా సోకింది. విక్టోరియా రాణి కాలపు నైతిక విలువలు పతనమై, అణుయుగ ప్రవేశంతో మానవ జీవితంలో సందిగ్ధ పరిస్థితు లేర్పడి, ప్రపంచం అనేక ప్రాంతాలలో మార్క్సిజం తన జెండా ఎగురవేసిన రోజులవి వీటన్నిటి ప్రభావం బెంగాలు సాహిత్యం మీద పడింది.

టాగూరు యుగం చివరిదశలోనూ టాగూరు అనంతరకాలంలోనూ బెంగాలీ సాహిత్య నిర్మాతలలో చాలామంది ఆంగ్లభాషా నిష్ణాతులు కావడం ఒక విశేషం. బుద్ధదేవ బోస్, విష్ణు డే, అమియ చక్రవర్తి, సమరసేన్, జీవనా నందదాస్ ప్రభృతు లందరూ యీ కోవకు చెందినవారే. అందరూ ఆంగ్లభాషా బోధనాచార్యులు కాకపోయినా ఆంగ్లపత్రికల్లో జర్నలిస్టులుగావుంటూ ఆంగ్ల భాషతో సాన్నిహిత్యం కలిగి వున్నారు. పాశ్చాత్యదేశాల కళలు, సాహిత్యం లోని పురాతన, అధునాతన గాథలతో సంబంధం గల పదచిత్రాలు వారు రచించిన కవితల్లో కొల్లలుగా కనిపించేవి. టి. ఎస్. ఇలియట్, వెబ్స్, డబ్ల్యు. బి. ఈట్స్, క్రిష్టాఫర్ కాడ్ వెల్, రజనీ పామిదత్, అస్వాల్డ్ స్పెంగ్లర్ మొదలగు వివిధ పాశ్చాత్య రచయితల ప్రభావానికి లోనై బెంగాలీ సాహిత్యం రకరకాల దారులు పట్టి స్పష్టమైన గమ్యం లేకుండా ప్రయాణం చేసింది.

బెంగాలీల వేషధారణ మీది కంటే, వారి మనస్సుల మీద పాశ్చాత్య భావ ప్రభావం బలంగా పడింది. అయితే యీ ప్రభావం బెంగాలీ జీవితంతో

సమన్వయత ఏర్పరచుకుంటూనే పడింది. పాశ్చాత్య విజ్ఞానం బాగా అబ్బిన కొలదీ, వ్యక్తిలో బెంగాలి తనం యింకా బాగా దృఢపడింది. సమన్వయత సాధించబడింది. ఉదాహరణకు సుధీంద్రనాథ్ దత్తా సంస్కృత సాహిత్య విజ్ఞానం సమృద్ధిగా కలిగివుండి, అటువైపు టి. ఎస్. ఇలియట్, బాద్లేర్, పాల్ వేలరీ ప్రభృతుల రచనలను జీర్ణం చేసుకుని యీ రెండింటి సమ్మేళ నంగా మనోహరమైన ఆంగ్లభాష వచన శైలిని సమకూర్చుకున్నాడు. తన కొక ప్రత్యేక మానసిక వ్యక్తిత్వాన్ని రూపొందించుకున్నాడు. ఈ భావ సమ్మేళనం జరగడంలో ఒక ప్రత్యేకత ఏమీ లేదు. నిజానికి ఆ తరంలో అందరు రచయితల్లోనూ యిది జరిగింది. కాని ఒక్కొక్కరిలో అది ఏ విధంగా ఒక రసాయనిక క్రియ లాగా కలిసిపోయి యెటువంటి ఫలితం కలిగిందన్న దాని మీదే దాని ప్రత్యేకత ఆధారపడి వుంది

జీవితాంతం ఆంగ్లభాషా, సాహిత్య వ్యాసంగాలలో మునిగి వున్నప్ప టికీ జీవనానంద దాసు ఏ దేశ సాహిత్యానికైనా వన్నె తెచ్చే దేశభక్తి గీతాలు రాయగలిగాడు. ఆయన ఆంగ్ల భాషాభినివేశం దీనికి ఏ విధంగానూ అడ్డు రాలేదు ఆయన రాసిన దేశభక్తి కవితల నిండా బెంగాలీ జీవిత సత్యాలు, బెంగాలు స్వరూప స్వభావాలు కొల్లలుగా వుంటాయి. ఇవన్నీ అంతగా ఆ కవితల్లో పెనవేసుకుని ఉన్నందువల్ల వాటిని అనువదించడంకూడా నాకు కష్టమైంది. (రూపసి బెంగాల్ – అనే కవితా సంపుటి నుండి "ఒక నాటికి మళ్ళీ నేనొస్తాను" అన్న పద్యం మాత్రమే కష్టంతో అనువదించి యీ సంపుటిలో చేర్చగలిగాను.)

జీవనానంద దాసు జీవితంలో కవితా రచనలో బాగా ప్రయోజనకర మైన దశ బెంగాలీ సాహిత్యంలో ఫాసిస్టు వ్యతిరేక భావనలు విజృంభించిన కాలంలో ప్రారంభమైంది. అప్పట్లో 46, ధర్మతుల్లా వీధిలో ఫాసిస్టు వ్యతి రేక రచయితలు, కళాకారుల సంఘం పనిచేస్తుండేది. యుద్ధానంతర కాలంలో యిదే బెంగాలీ అభ్యుదయ రచయితల, కళాకారుల సంఘంగా మారి 1950 దశకంలో సాహిత్య కళారంగాలను ప్రభావితం చేసింది. అభ్యుదయ కవితా తత్వం బాగా వ్యాపించిన రోజుల్లోనే జీవనానంద దాసు కవితా వ్యాసంగంలో ప్రధాన దశ ప్రారంభమైంది.

ఆ కాలంలో యువకవులూ, రచయిత లందరూ యీ ఉద్యమ ప్రభా వానికి ఆకర్షితులై అందులో దూకారు. రచయితలు ప్రజాజీవితంలో సమైక్యమై

రచనలు చేయడం, ప్రజాశక్తుల తుది విజయంలో విశ్వాసం కలిగి వుండటం యీ యుగం ప్రధాన లక్షణాలు ఆ సమయంలో మరొక విధంగా రచనలు చేయడమంటే పలాయనవాది అనే పేరు కొని తెచ్చుకోవడమే. జీవనానంద దాసు మరో విధంగానే రాసి పలాయనవాది అనిపించుకున్నాడు. అయితే అంతటా ఆవరించి వున్న ఆ నాటి యుగలక్షణాలతో సమన్వయం పొంది కేవలం పేరుకోసం జీవనానంద దాసు తన నిర్ణీత మార్గాన్ని తప్పి ప్రవర్తించ లేదు. బెంగాలీ సాహిత్యంలో వామపక్ష భావాలు చోటు చేసుకోవడం ప్రారంభమైన తొలిదశలో, ఆంగ్లభాషా పరిచయం కలిగిన విద్యావంతులైన మధ్యతరగతి ప్రజలకూ, హఠాత్తుగా సాహిత్యంలో కావ్యవస్తువుగా మారిన నిరక్షరాస్యులైన సామాన్య ప్రజలకూ మధ్య వుండే అంతరం సరిగా గుర్తించబడలేదు. జీవనానంద దాసు అనుసరించిన మార్గానికి యిదే ప్రధాన కారణం.

ఈ పరిస్థితివల్ల సాహిత్య నిర్మాతలలో కలిగిన మానసిక సంఘర్షణ వివిధ రకాలుగా బైటికి పొంగింది. అందువల్లనే పట్టణాల్లోని మధ్యతరగతి ప్రజల కష్టాల వర్ణన చేస్తూ సమరసేన్ తన కవితలో ప్రదర్శించిన అస హనం, సామాన్య ప్రజల తుది విజయంలో ఆయన వెల్లడించిన ఊకదంపుడు విశ్వాసాలకంటే ఎక్కువగా సాహిత్య వర్గాలకు ఆమోదయోగ్యమైంది. సమర్ సేన్ ఈ పరిణామాన్ని పూర్తిగా గుర్తించినందువల్లనే కవితా సన్యాసం కూడా చేయడానికి సిద్ధపడ్డాడు. విష్ణు డే రచనల్లో అప్పుడప్పుడు కనిపించే జెండా ప్రాధాన్యం కంటే, మానవ జాతి పట్ల సాధారణ గౌరవం కృషించి పనిచేసే కార్మికవర్గం పట్ల జాలీ ప్రధానంగా చోటు చేసు కున్నాయి. నాటి కవులు, మార్క్సిస్టులు చెప్పినట్లు, తమ వర్గ స్వభావాన్ని వదలుకోవడంలో విఫలులైనారు. ఆ కాలపు కవితలను బాగా పరిశీలించి చూస్తే, సుభాష్ ముఖోపాధ్యాయ, సుకంతో భట్టాచార్య వంటి కవులు రాసిన ఏ కొన్ని గేయాలలోనో తప్ప, ఫాసిస్టు వ్యతిరేకతతో పెల్లుబికిన కవిత్వం నిజంగా ప్రజానీకాన్ని చేరిందా అనేది సందేహమే. సామాన్య ప్రజల్లో చైతన్యం పెరుగుతున్న ఆ రోజుల్లో కవి తనకు తానే తుది లక్ష్యం వల్ల ప్రభావితుడై తనకు తాను తన్మయుడై దానిని ఏదో విధంగా కవితల రూపంలో బైటికి కక్కడం తప్ప ప్రజల హృదయాలను స్పందింపజేయలేక పోయాడేమో అనిపిస్తుంది.

మరొకవైపున కేవలం కవితా రంగానికి బద్ధులై, ప్రజాజీవిత కావ్య వస్తువుతో తక్కువ సంబంధం పెట్టుకుని, ప్రజల భవిష్యత్తును గురించి అంతగా ఆలోచించని కవులే తాము చెప్పినంతలో తాదాత్మ్యం పొంది చెప్పగలిగారు. వామ పక్ష రచయితలు చైతన్యం తెచ్చుకొని ప్రయత్న పూర్వంగా పొందిన కవితా తాదాత్మ్యం కంటే విభూతి భూషణ్ వంద్యోపాధ్యాయలో ఎక్కువ తాదాత్మ్యం కనిపిస్తుంది విభూతి భూషణ్ అనే నవలా రచయిత లాగా జీవనంద దాసుకు బెంగాలు ప్రకృతి జీవితం లోని దృశ్యాలతో - చెట్లూ చేమలూ, నదులూ, ఋతుశోభా వైవిధ్యం, పొలాలూ, పైర్లు, సామాన్య ప్రజలు పనిపాటలు చేసుకునే తరహాలు మొద లగు వాటికి సంబంధించిన పరిజ్ఞానం అనంతంగా వుంది. విభూతి భూషణ్ కూడా జీవనానంద దాసు లాగా వామపక్ష భావాలతో ప్రభావితం కానివాడే విభూతి భూషణ్ రచించిన నవలలను కొన్నింటిని సత్యజిత్ రాయ్ తన చలన చిత్రాలకు ఉపయోగించుకున్నాడు. జీవితంలో తాదాత్మ్యభావనకు ప్రాధాన్యం యిచ్చేవే సత్యజిత్ రాయ్ చిత్రాలు. వీరిద్దరితోపాటు యీ విష యంలో చిత్రకారుడు జెమినీ రాయ్‌ని కూడా చేర్చవచ్చు. జెమినీ రాయ్ కళా ఖండాలకు విష్ణు డే సమర్థుడైన వ్యాఖ్యాతగా రాణించాడు.

టాగూరు అనంతర కాలంలో కవితా రంగంలో జీవనానంద దాసు సాధించిన ఘన విజయాలు, ఆ ధోరణి కవితకు ఆయనలో సంపూర్ణత సిద్ధించినదనే విషయమూ యీనాడు బెంగాలులో అందరూ ఆమోదించే సత్యాలు. నజురుల్ ఇస్లాం గొంతెత్తి దేశభక్తి గీతాలు గానం చేశాడు. కాని త్వరలోనే బ్రతుకు బాధల అలసటలో మునిగిపోయిన ఆ తరం ప్రజానీకానికి వాటిపట్ల మోజు తగ్గి, అవి నిర్జీవంగా కనిపించాయి. తమపట్ల ప్రజల అభి రుచిని అవి నిలబెట్టుకోలేక పోయాయి. సుధీంద్రనాథ దత్తా సంస్కృత సాహిత్యం లోతుల్లోకి వెళ్ళి, సమకాలీన జీవితాన్నీ, సాహిత్యంలో ఆ నాటి విలువలనూ సమన్వయపరచడానికి కృషి చేశాడు. విష్ణుడే తన కవితలో మృదుత్వ స్పర్శతో ఆవేశం అనుభూతులను మేళవింప చేసి అరగాన్, ఇలార్డ్ వంటి కవులవలె ప్రజల్లో వైజ్ఞానిక చైతన్యాన్ని పురికొల్పాడు. బుద్ధదేవ బోస్ తన అనుభూతులను ప్రజల అనుభూతులుగా ప్రకటించి ప్రజాహృదయాలను దోచుకున్నాడు. ప్రేమేంద్ర మిత్ర విశాల దృక్పథంతో సామాన్య ప్రజలను ఆకర్షించాడు. అమియ చక్రవర్తి రచనల్లో ఆధునిక భాషలోని నుడికారమూ,

శైలీ, గమనమూ బాగా చోటు చేసుకున్నాయి. సుధీంద్రనాథ్‌వలె అజిత్ దత్తా భారతీయమైన భావాలకూ, సమకాలీన జీవితానికి తన ప్రత్యేక దృక్ప థంతో సమన్వయం సాధించాడు. అల్పాక్షరములలో అనల్పార్థ రచన చేసి ఆయన కవితలో క్లుప్తత సాధించుకున్నాడు. ఆ విధంగా కవుల్లో ప్రతి ఒక్కరూ తమ తమ ప్రత్యేక ప్రతిభను ప్రకాశింప జేశారు. అయితే ఏ ఒక్క రైనా జీవనానంద దాస్ ప్రదర్శించిన నూతనత్వమూ, కవితాశక్తి, సమ్మో హన గుణమూ ప్రదర్శించారా అంటే సందేహమే. ఈ నాటి బెంగాలీ యువకుల హృదయాల్లో జీవనానంద దాస్‌కు టాగూరు వదలివెళ్లిన స్థానం స్థిరంగా లభించింది. యువతరం మీద ఆయన ప్రభావం బహుముఖంగా వుంది — కవితా రంగం వరకే; తదితర రంగాల సంగతి వేరు.

# 2

# జీవనానంద దాస్ - వ్యక్తిత్వం

జీవనానంద దాస్ జీవితమంతా కవిత్వంలోనే మునిగి తేలాడు. కొన్ని కథలూ, వ్యాసాలూ, నవలలూ రాశాడు కాని మొత్తంమీద కవిత్వమే అతని వ్యక్తిత్వం నిండా వ్యాపించి పోయింది. టాగూరుకు వున్నట్లుగా ఆయనకు కళాజీవితాన్ని ఆవిష్కరించడంలోనూ, తాను దానిని అనుసరించ డంలోనూ సమైక్యత లేదు. అంటే కవితలో కనిపించిన సౌందర్యం ఆయన వేషధారణలో వుండదు. శైలిలో వుండే శోభాకర్షణ తన నివాసగృహంలో వుండదు. అంటే ఊహకూ సత్యానికీ సమన్వయం లేదు. తాను నిర్మించిన కల్పనా జగత్తుకూ, సాంఘిక వాతావరణంలోని నిత్యజీవితానికి సంబంధం వుండదు. తూర్పుబెంగాల్‌లోని బారిసాల్ ప్రాంతంలో పుట్టి పెరిగి పెద్ద వాడైన తర్వాత కలకత్తాలో జీవితం గడిపిన జీవనానంద దాస్ గ్రామీణ

పట్టణ జీవితాలు రెండింటిలోనూ తన లోకం తనదిగా, ఒక ప్రత్యేకతగా ఎప్పుడూ ఊహాజగత్తులోనే ఆలోచించేవాడు తాత్కాలిక జీవిత సమస్యలకు దూరంగా వుండి చూసినా, జీవితాన్ని నిశితంగానే పరిశీలించగల శక్తి గల వాడు. అయితే ఆ జీవిత సమరంలో ఆయన పాల్గొనడం మాత్రం కేవలం తన రచనల ద్వారానే ఆయన నూటికి నూరుపాళ్ళు కవి. నిజానికి కవేగాని మరేదీ కానివాడు

'నిజంగా ఒక వ్యక్తి కవే అయితే, నిత్యజీవిత సమస్యలతో సతమత మయ్యే యీ లోకానికి అతడు తాను యిచ్చే ప్రథమ బహుమతి కవిత్వం. అంత కంటే మేలైన కానుక మరొకటి యివ్వనే లేడు' అని ఒక వ్యాసంలో ఆయన తన అభిప్రాయం వెలిబుచ్చాడు

జీవనానంద దాస్ ట్రాము కారు క్రిందపడి మరణించడం జీవితం మనకు చూపిన చమత్కారాలలో ఒకటి. అయ్యో అని మనకు మనసులో అనిపించినా, మంచానపడి బాధపడకుండా యీ హఠాన్మరణంలో కూడా ఆయన కవితా సాహసం తొంగి చూస్తూనే వుంది మరణించడానికి ముందే ఆయన జీవితంలో పతనావస్థ స్థూలంగా చోటు చేసుకుంది. ఎందుకంటే ప్రజలు తరచుగా ఆయన ఏది నిజంగా కాడో అదిగా భ్రమించేవారు. నిత్య జీవితంతో సన్నిహిత సంబంధంగల వ్యక్తిగా ఆయన్ను ఊహించుకునేవారు. అందువల్లనే చాలాకాలంపాటు ప్రాచీనులూ ఆధునికులు కూడా ఆయన మీద హేళన బాణాలతో విమర్శా సమరం సాగించారు 'శనివారర్ చీటి' (శని వారపులేఖ) అనే పత్రికలో దాదాపు ప్రతి సంచికలో సజినీకాంత దాస్ జీవనానందదాస్‌ను దుయ్యబడుతుండేవాడు. జీవనానంద దాస్ నిష్ఠాసంపన్న మైన బ్రహ్మసమాజ కుటుంబంలో పుట్టిపెరిగినవాడు. తండ్రి మంచి పండి తుడు. ఉపాధ్యాయ వృత్తిలో వుండేవాడు. తల్లి కవయిత్రి. జీవనానంద దాస్ కొంతకాలం కలకత్తాలో బ్రహ్మసమాజికుల పెత్తనంలో నడుస్తున్న సిటీ కాలేజీలో ఇంగ్లీషు లెక్చరర్‌గా పనిచేశాడు. అయన రాసిన ఒక కవితలో స్త్రీవక్షస్థల సౌందర్యాన్ని వర్ణించినందుకు శిక్షగా, పరిశుద్ధ బ్రహ్మసమాజ వాదులైన కాలేజీ నిర్వాహకులు ఆయనను ఆ పదవినుండి తీసివేశారని అంటారు. మరొక కథనం ప్రకారం ఆయన కుటుంబంలోనివారే కవితల్లో కనిపించే వనలతా సేన్ ఎవరనీ, వివాహితుడైన తాను పరస్త్రీతో సంబంధం

పెట్టుకోవచ్చునా అని నిగ్గదీసి అడిగారనీ ప్రజలు అనుకుంటారు. ప్రచారంలో వున్న యిటువంటి కథల సత్యాసత్యాల మాట ఎలావున్నా ఆ కాలానికీ ఆ వ్యక్తికీ సంబంధించిన కొన్ని విశేషాలను మాత్రం అవి స్పష్టంగా బైట పెడుతున్నాయి. జీవనానంద దాసు దాదాపు తన జీవితకాలమంతా ఆంగ్ల భాషోపాధ్యాయుడుగానే కాలం గడిపాడు. కాని వచ్చే ఆదాయం చాలక చివరిదశలో తన కవిత్వం బాగా పేరు ప్రతిష్ఠలు సంపాదించుకోబోతున్న తరుణంలోనే యిన్స్యూరెన్సు పాలసీని వచ్చినంతకు తెగనమ్ముకోవలసి వచ్చింది

ప్రజలతో మాట్లాడవలసి వచ్చినప్పుడు ఏం చెప్పాలో తెలియక జీవనానంద దాసు తికమకపడుతూండేవాడని బుద్ధదేవు బోసువంటి ఆయన అభిమాని కూడా ఒప్పుకున్నాడు. ఏదో ఒక ముసుగు వేసుకుని మాట్లాడుతున్నట్టే వుండేది. దాని లోపలికి తొంగి చూడడానిక్కూడా ఎవరికీ సాధ్యం కాకుండా వుండేది. అటువంటప్పుడు ప్రజలు ఆయన్ను అర్థం చేసుకోలేదంటే ఆశ్చర్యమేముందీ ? టాగూరు ప్రదర్శించిన ప్రశాంత, సమైక్య, సంపూర్ణ సమన్వయతా భావాలకు చాలా దూరంగా నడిచిన జీవితం జీవనానంద దాసుది. ఎందుకంటే ఆయన జీవితం ఆయన జీవించి వున్న కాలానికి సంబంధించిన సమస్తగుణాలకూ ప్రతినిధిగా నిలుస్తుంది—రకరకాల ఉద్రేకాలు, వేర్పాటులు, ప్రజలు మనస్సుల్లోపడే బాధలు, విలువలలో విశ్వాస రాహిత్యం నిరాశానిస్పృహలు మొదలగు లక్షణాలన్నీ అందులో ప్రతిబింబించాయి. జీవితంలోనూ, రచనలోనూ జీవనానంద దాసు అక్షరాలా టాగూరు అనంతరం కాలానికి అంకితమైనవాడు.

# 3

## కవిగా......జీవనానంద దాసు

ఇన్నాళ్లుగా ఎక్కడున్నావు ?
అడిగింది వనలతా సేన్ ఆశ్చర్యంగా
మరెన్నో ప్రశ్నలు మౌనంగా అడిగింది
పిచ్చుకగూళ్ల వంటి అందమైన కళ్లతో.

జీవనానంద దాస్ కవితలోని ప్రత్యేకతలలో ఆయన ప్రదర్శించిన భావ చిత్రాలలోని నవ్యత్వం ఒక అంశ మాత్రమే. అయినప్పటికీ బెంగాలీ కాక మరే యితర భాషలోనైనా ఆయనను గురించి రాయవలసి వచ్చినప్పుడు భావ చిత్రాల దగ్గరే ప్రయాణం ప్రారంభం కావాలి. ఎందుకంటే అను వాదాలలో కూడా భావ చిత్రాలలోని ప్రత్యేకతా, బలమూ కొంతవరకైనా కనిపిస్తూనే వుంటాయి. భావ చిత్రాలను అనువాదం చేసినప్పుడు ఆయన కవితలో ప్రత్యేక లక్షణమైన సంప్రదాయ, సమకాలీన భావ సమైక్యత కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఈ సమైక్యతే ఆయనకు ఒక ప్రత్యేకతను సాధించింది. జీవనానంద దాసును కవిగా అర్థం చేసుకోవాలంటే యీ ప్రత్యేక తను గుర్తించడం అవసరం.

జీవనానంద దాసు ప్రదర్శించిన భావ చిత్రాలు, భాషలో నుడి కారమూ, సంస్కృతసాహిత్య సంప్రదాయాలలో నుంచి టాగూరు కల్పించు కున్నవాటి కంటే చాలా ప్రత్యేక వ్యక్తిత్వాన్ని కలిగి వుంటాయి. అను వాదంలోకి వచ్చేసరికి టాగూరు భావ చిత్రాలు గుర్తించలేనంతగా బల హీనమై పోతాయి. జీవనానంద దాసువి అలా కావు. ఆయన భావ చిత్రాలు స్పష్టంగా వుంటాయి. పాత కవి సమయాలకు కట్టుబడి వుండవు. అసహ్యా కరంగా కనిపించే వాటి నుండి కూడా భయపడి ఆయన దూరంగా తొలిగి

పోడు. నిజానికి కావాలని టాగూరుకు ఎదురు తిరిగిన బుద్ధదేవు బోసు, విష్ణు డేవంటివారే యీ విషయంలో టాగూరుకు దగ్గరగా వుంటారు. కవితలో వాక్యనిర్మాణం, భాషలో సహజత్వం విషయంలో వారు టాగూరునే అనుసరించారు. జీవనానంద దాసు మార్గం వేరు. చెట్టు అంటే చెట్టు అని సాధారణీకరించి వదలిపెట్టడు. ఏ చెట్టో పేరు కూడా చెప్తాడు. ఆయన కవితలో పదాలు వుండవలసినచోట వుండవు. సందర్భ పరిధిని దాటిపోయి ఎక్కడో వుండనూవచ్చు. దానివల్ల వాటికి ఒక అధివాస్తవిక భావనా బలం ఏర్పడుతుంది. కవితా వాక్య నిర్మాణం క్లిష్టాన్వయాలతో చెదిరిపోయినట్లుంటుంది.

జీవనానంద దాస్ ప్రదర్శించిన విశాల భావ చిత్ర ప్రపంచంలో "మృత్యుపరిష్వంగానికి ముందు" అనే గేయం ఒక విశిష్ట మార్గానికి చెందినది. దీని నిండా కండ్లకు కనిపించే, చెవులకు వినిపించే చిత్రమైన క్లిష్టమైన సంకేతాలు వున్నాయి. ఇవన్నీ కవియొక్క వ్యక్తిగత అనుభూతులలో నుండి పుట్టి హఠాత్తుగా రెక్కలు వచ్చి ఊహా లోకాలలోకి ఎగిరి పోతున్నట్లుంటాయి. అలంకారాల అందాలతో బలంగా మనసును హత్తుకుంటాయి.

"నది ఒడ్డున మంచుపూలు వెదజల్లుతున్న
నారీ రత్నాలను చూసిన మేం!"
"సీటిలో ఏకాంతంగా యీదే
చేప కన్నెల నేత్రాల లోకి
అలల ద్వారా చొచ్చుకు పోయిన
ధాన్యపు సుగంధాలు దర్శించిన మేం!"
"దొడ్లో పరచుకున్న వెన్నెల పాలరాతి ఫలకం మీద
పూరి గుడిసెల నీడలు శిల్పాల ముద్రలలా పారాడడం
చూసిన మేం"

"ఆ నిశ్చల కాంతి పుంజం దగ్గరలోనే
అందాల కుప్పలు కన్యాకామణులు
ధూప పరిమళ దేహాలతో దూరంగా కనిపిస్తుంటే"

ప్రకృతి పరిశీలనాశక్తి లోతుల్లోకి తొంగి చూస్తూ, తీవ్రభావనతో స్పష్టతతో కొట్టవచ్చినట్లు కనిపించే యీ పద చిత్రాలు యీ గేయానికి మూలభూతమైన కథాంశ ప్రవాహంలో సులువుగా కలిసి పోయే స్వభావం కలిగినట్టివి. ఈ మూల కథాంశం చివరి పంక్తుల్లో విశదీకరించబడింది.

"ఇంతకు మించి నేర్చేదేమిటి మృత్యు పరిష్వంగానికి
ముందు ?
ఎర్రగా ఎత్తుగా పెరిగిన ప్రతి కోర్కెకు ప్రక్కన గోడలా
నల్లటి మృత్యుముఖం దాక్కుందని నరులైన మనకు తెలేదా!
మనిషి మనసులో పండే కలలూ, ఐహిక భోగోల బంగారు
ఛాయలూ
ఒక మహా ప్రశాంత నిశ్చల యోగ స్థితిలో
సమతూకంలో ఉంటాయని సమస్త ప్రజలకు తెలేదా ?
ఒక విచిత్రమైన అవసరం ముగిసినట్లు తెలేదా ?
ఇంకా ఏమిటి తెలుసుకొనేది మృత్యు పరిష్వంగానికి ముందు ?
అస్తమయ సూర్యుడి చెవులు చిల్లులు పడే విధంగా
పక్షులు గొంతెత్తి పలవరించడం వినలేదా ?
కప్పిన మంచు తెరలు చీల్చుకుంటూ, కాకి ఎగిరి పోవడం
చూడలేదా ?"

ఒకదాని వెంట ఒకటిగా భావ చిత్రాలు ఊహల దొంతరగా అమర్చబడి హృదయాన్ని ఊరించి ఊరించి చివరకు పరాకాష్ఠ దశ చేరుకుంటాయి. ఈ దశ "శవ సామ్రాజ్యం" అనే మరొక గేయంలో యింకా నాటకీయంగా నిర్వహించబడింది.

ఈ భావ చిత్రాలు ప్రకృతి సౌందర్యానికి అతి సన్నిహితంగా యిప్పుడు బంగ్లాదేశ్ అని పిలువబడుతున్న చోట బారిసాల్‌లో నివసించిన కవి యొక్క నిశిత పరిశీలనాదృష్టికి నిదర్శనగా వున్నాయి. "ఆకులో ఆకునై పూవులో పూవునై" అన్నట్లు యీ కవి ప్రకృతిలో తాదాత్మ్యం చెందినవాడు.

కొన్ని భావ చిత్రాలు చాలా సులభమైనవే కాని వాటితో వస్తు పరిచయం లేని వారికి అవి వింతగా కనిపించే అవకాశం వుంది. "గాలిపటం" అనే కవితలో కండ్లను పేముచెట్టు పండ్లతో పోల్చడం అచ్చమైన ప్రకృతి పరిశీలన. ఎందుకంటే చూసిన వారికే తెలుస్తుంది యీ రెండిటి మధ్య ఉపమా సమాన ధర్మం ఎంత చక్కగా అల్లుకుని వుందో. "ముగ్గురు ముష్టి వాళ్ళు" అనే మరో గేయంలో చిత్రించిన వాతావరణం దీనికి పూర్తిగా దూరంగా ఉంది. అది పట్టణ వాతావరణం. హాస్యజనకంగానూ కోప పూరితంగానూ వుంది.

"ఈ మెట్ట వేదాంతం వింటున్న ఒక దోమకు కొండంత
కోపం వచ్చి
ఒకరి ముక్కు మీద నుంచి మరొకరి చెవి మీదికి
ఎగిరి గంతేసింది
బెంటిక్ వీధిలో నది ఒడ్డున కూర్చొని
తమకు లేని లోక సుఖాలు ముష్టివారు
వ్రేళ్ల మీద లెక్కించు కొంటున్నారు."

అయినా సరదాగా చమత్కారంగా లలితమైన స్థాయిలో రాసినా దాని ఫలితంగా గంభీరతా ముద్రాంకితమైన భావ పరిణతికే అది దారితీసింది

"ఎందుకు యీ చర్చంతా అంటే
ఇక మీద వీరు ఏటి ఒడ్డుకు వెళ్లాలి
అక్కడ ఎముక ముక్క తింటున్న కోతి
నీటిలో ప్రతిఫలిస్తుంది
కాలం అనేది ఉన్నంత కాలం
కనిపిస్తూనే వుంటుంది ప్రతిబింబం."

ఇక మూడవ రకం భావ చిత్రాలు కేవలం ఆంగ్లభాషకు సంబంధించిన నుడికారం నుండి సంగ్రహించబడినట్టివి.

నేను (ఆంగ్లానువాదకుడు చిదానందదాస్ గుప్తా) మొదట్లో "సరోజినీ దేవి సమాధి" (ఎపిటాఫ్) అనే గీతం చదివినపుడు మొదటి రెండు పంక్తుల

లోని భావం సులభంగా బోధపడనే లేదు. కాని వాటిని ఆంగ్లీకరించినప్పుడు కావ్యార్థం బహుధా విస్తరించింది. నిజానికి బెంగాలీ మూలం లోని పంక్తులే నా ఆంగ్ల కవితకు అనువాదమేమో అన్నట్లుగా కనిపించాయి.

**ఇదుగో యిక్కడ నిద్రిస్తున్నది మన సరోజినిదేవి**
**(ఇంకా ఇక్కడే వుందేమో నాకు మాత్రం తెలీదు)**
**ఇక్కడే శాశ్వతంగా ఉండేట్లు**
**సంగీతాన్ని దాచి పెట్టారు"**

బెంగాలీ భాషలోని అర్థం ప్రకారం ఆయన మొదట్లో వాడిన పద బంధంలో శ్మశానస్థలి స్ఫురించదు. సజీవంగా వున్న స్త్రీ ప్రక్క మీద పడుకుని వున్న భావం మాత్రమే కలుగుతుంది. రెండవ పంక్తి చివరకు వచ్చేసరికి ఆయన భావం యిదై వుంటుందేమోనని మనం ఊహించ గలుగు తాము ఆంగ్లభాషలో సమాధి రాయి మీద "హియర్‌లైస్" అనే పదబంధం వాడతారు యీ పదబంధం స్ఫురించే సమాన బెంగాలీ పదబంధాన్ని రెండవ పంక్తి చివర్లో వాడి ఆయన మనలను ఆశ్చర్యంలో ముంచెత్తి తన మనసులోని భావనను ఆవిష్కరిస్తాడు. అదే విధంగా "పెంపుడు పిల్లి" అనే గీతంలో పైన వివరించిన పద్ధతినే కవి అనుసరించలేదు. కాని యిందులోని భావన పాశ్చాత్య సాహిత్యానికి చాలా దగ్గరగా వుంటుంది. ఈ రెండు కవితలలో మరొక విశిష్టమైన సామ్యం కనిపిస్తుంది. రెండు కవితలలోనూ కవి ఊహ వర్ణనస్థాయి నుండి హఠాత్తుగా విశ్వ భావన స్థాయికి ఉవ్వెత్తుగా ఎగిరి పోతుంది. ఉదాహరణకు "సరోజినీదేవి సమాధి" గీతంలో

**"ఆకాశంలో కాషాయవర్ణ కిరణ శకలం ఒకటి**
**పరివేషంతో మిలమిలా మెరుస్తోంది**
**పీహారం కప్పిన నిప్పు కన్నెలా**
**బూడిదలో దాక్కుని కనిపించని పిల్లిలా**
**కనిపించీ కనిపించని ముఖం మీద చిరునవ్వు చిందులతో**
**ఛాయాపథల కనువిందులతో".**

ఈ మూడు విధాలైన భావ చిత్రాల కల్పనలో కూడా కవియొక్క మూలానుభూతిని వెతికి పట్టుకోవచ్చు. ప్రకృతి, పట్టణ వాతావరణం, పాశ్చాత్య సాహిత్యం యీ భావనలకు మూల స్థానాలుగా మనకు కనిపిస్తాయి. కాని చరిత్రకు సంబంధించిన భావ చిత్రాలకు మాత్రం కవిని కాక మరే విధమైన మూల స్థానాన్ని గుర్తించడం కష్టం ఆయన కవితలో యీ చారిత్రిక భావ చిత్రాలు అతి తరచుగా కనిపిస్తూ అన్నింటి కంటే ప్రధాన లక్షణంగా భాసిస్తుంటాయి "వనలతా సేన్" అనే పేరుతో అత్యంత ప్రసిద్ధి పొందిన గీతంలో ప్రారంభంలోనే ఆయన అంటాడు·

"శతానేక బ్రహ్మ కల్పాలు గతంలో కలిసి పోక ముందే
ఈ భూమ్మీద కాలం పరచిన గులకరాళ్ళ రస్తాల వెంట
ఓపికతో ఒక్కడినీ ఒంటరిగా ఆ నాడు తిరుగుతూ,....
ఆ నాటి కోపఘూర్ణిత సముద్ర తరంగ ఘోషలు
ప్రళయంగా యింకా నాలో ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి.
సింహాళ సముద్రతీరం నుండి
చీకటి రాత్రుల్లో జీవకళలు విరుగుతూ
మలయా జల సంధి దాకా
మత్తుగా నడుస్తుండేవాణ్ణి
కాలం గోడలతో కట్టి
క్షణక్షణం కదుల్తున్న వరండాలో
బింబిసార, అశోక సామ్రాట్టుల ఆజ్ఞలు
పొగమంచుగా కళ్ళల్లో పొడుస్తున్నచోట
చిక్కపోయిన విదర్భలో చిమ్మచీకటి పరుచుకున్నప్పుడు
అప్పుడు నేను ఒక్కణ్ణే అంతటా తిరుగుతుండే వాణ్ణి
అప్పట్లో నాకు కలిగిన మనశ్శాంతి ఒకే ఒక్కచోట
నాటూర్లో వనలతా సేన్ నన్ను ఆలింగనం చేసుకున్నచోట"

కాలం వీధుల్లో అనంతమైన ప్రయాణం చేస్తూ అలసిపోయిన ఆత్మ ఆవేదన పొందుతున్నట్లు భావించే దృక్పథం జీవనానంద దాస్ కవితలో జీర్ణించి పోయింది. ఒక్కొక్కప్పుడు యీ భావన హఠాత్తుగా కవితలో నుంచి పొంగి వచ్చి ఆయన కవితతో అంతగా పరిచయం లేని సామాన్య పాఠకుణ్ణి విభ్రాంతుణ్ణి చేస్తుంది కూడా. "నిరంతర ప్రయాణం" వంటి గీతాల్లో యిది కనిపిస్తుంది. నిజానికి బెంగాలీ మూల శీర్షికను ఉన్నదున్నట్లు అనువదిస్తే "దారి వెంబడి ప్రయాణం" అని మాత్రమే అవుతుంది. (బ్యాబి లోన్ వీధులు" అని ఆంగ్లానువాదం లోని శీర్షిక)

"ఒక్కసారి క్రిందికి చూస్తాను
గాలి తోసిన ఎండు గడ్డి
కాలుతున్న సిగరెట్టు ముక్కతో కయ్యమాడుతుంటుంది
చూడలేక కళ్లు మూసుకుంటాను
మరోప్రక్కకు నక్కిచూస్తాను
చెట్టు క్రింద గలగలా రాలి పడిన ఆకులు
గంతేసి దూరంగా పరుగెత్తు తుంటాయి
చూడలేక కళ్లు మూసుకుంటాను
యీ అనంత నిశీధ నిశ్శబ్ద సౌందర్యంలో
ఎందుకు నే నిలా తిరుగుతున్నాను?
బాబిలాన్ వీధుల గుండా
కలకత్తా వీధుల గుండా
శతాబ్దాల క్రితం తెలిసిన దాని కంటే
ఎక్కువేం తెలిసింది ఇప్పుడు నాకు?"

ఈ కవిత మొదట్లో కలకత్తా నగరంలో రాత్రి పూట నడిచి వెళ్తున్న ట్లున్న వర్ణనతో ప్రారంభమై మనోహరంగా స్పష్టంగా ముందుకు సాగి పోతుంది. చివరకు మాత్రం పురాతన బాబిలోన్ నగరాన్ని తెచ్చి మన కండ్లముందు సాక్షాత్కరింపజేస్తుంది. ఊహా ముద్రలో అప్పటివరకు మునిగి వున్న పాఠకుల మనస్సులను అతి సహజత్వం వైపుకు అందంగా లాగేస్తుంది.

జీవనానంద దాస్ కవితల నిండా చారిత్రిక సందర్భాలు కోకొల్లలుగా అల్లుకుని వుంటాయి. సాధారణ రూపంలోనే కాక స్పష్టంగా చారిత్రిక పురుషులను యుగాలను గురించిన ప్రసక్తులు చాలాచోట్ల చూడవచ్చు; బ్యాబిలోన్, ఫోనిషియా, అస్సీరియా, నినేవే మొదలైనవి పశ్చిమ ఆసియా, ఈజిప్టు దేశాల శిథిల పురాతన నాగరికతల పట్ల ఆయనకు ప్రత్యేకంగా మోజు వున్నట్లు కనిపిస్తుంది. పతంజలి, అంబాపాలి, నాగార్జున, శ్రావస్తి, కన్ఫ్యూషియస్, అత్తిలి వంటి చారిత్రిక పాత్రల, ప్రదేశాల ప్రసక్తి ఆయన రచనల్లో వందల సార్లు వస్తుంటుంది. "మకర మాసం చివరి రాత్రి" అనే ఆయన కవితలో కాల ప్రవాహానికి సంబంధించిన చారిత్రిక చైతన్యాన్ని పరుగెత్తుతున్న పక్షితో పోలుస్తాడు. ఈ పక్షిని ఉపమానంగా తీసుకునే ఆయన కవితా స్వభావం తరువాత రాసిన "సూర్యునితో పోలిక" లోనూ, యింకా అనేక యితర కవితల్లోనూ ప్రస్ఫుటంగా గోచరిస్తుంటుంది. ఆయన కవితలో కాల ప్రవాహాన్ని గురించిన చైతన్యమూ విశ్వావకాశం లోని (స్పేస్) చైతన్యమూ అధికంగా వుంటాయి మలయాను గురించో ఈజిప్టును గురించో అట్లాంటిక్ మహాసముద్రం బేరిన్ జలసంధి మొదలగు వాటిని గురించిన ప్రసక్తి ఎప్పుడు వచ్చి పడుతుందో చెప్పలేనంత తరచుగా కనిపిస్తుంటుంది. ఎడిత్ సిట్‌వెల్ రచనల్లోలాగా జీవానంద దాస్ కవితలలో జంతు ప్రపంచం కూడా చోటు చేసుకునే ఉంటుంది. గుర్రపు శవం మీద చర్మం మీది పుండ్లు, గుడ్డి గుడ్లగూబ, బాతు, ఒంటె, బంగారు రంగులతో మెరిసే సింహం, రాబందు, ముడతలు పడిన ముసలి కప్ప, దోమ మొదలగు అనేక రూపాలలో. ఒక్కొక్కప్పుడు అకవితా స్వభావంతో కూడా ఈ జంతు సంతతి దర్శన మిస్తుంటుంది. జీవనానంద దాస్ కవితలో పూవుల ప్రసక్తి మృగ్యం. కాని, మొక్కలు, చెట్లు, చేమలు ప్రత్యేకంగా స్పష్టంగా పూర్తి పేర్లతో దర్శన మిచ్చి పాఠకుల్ని పలకరిస్తుంటాయి. సౌందర్యము, "కవితాత్మ" అనే వాటిని గురించిన స్పృహ జీవనానంద దాస్‌కు లేదు ఈ సందర్భంలో సౌందర్యము కవితాత్మ మొదలగు వాటికి సంబంధించి తాను నూతన సంప్రదాయాలను సృష్టి చేయాలనే ఉబలాటం కూడా లేదు.

"పుండుమీది నెత్తురూ, చీమూ పుష్కలంగా త్రాగేసి
తళ తళల రెక్క లాడిస్తూ యీగ ఎండలో ఎగురుతుంది"

అసహ్యకరంగా కనిపించే దృశ్యమే ఆయన కవితలో అర్థవంతంగా భాసిస్తుంది. ఆయన చూపదలచిన కోణాన్ని బట్టి అది సౌందర్య సమ్మిశ్రితం గానూ వుంటుంది. ఉదాహరణకు వీధి కుళాయి దగ్గర మూతి పెట్టి కుష్ఠు వాడు నీళ్ళు తాగడం, నోటి నుండి రక్తం కక్కుకుంటూ ప్లేగు వ్యాధి సోకిన ఎలుక చనిపోవటం, దోమతెరలోకి దూరాలని చావు బ్రతుకులతో దోమ ప్రయత్నించడం, పరుగెత్తుతున్న మోటారు కారు చుట్టూ పొగలు విరజిమ్మడం మొదలగు కంటి కింపు కాని దృశ్యాలు కనిపిస్తుంటాయి. అలాగే అందాల కుప్పలు కన్యకామణులు ధూప పరిమళ దేహాలతో దూరంగా కనిపించడం, సరస్సు నీటిలో హంసలు రాజహంసల రీవితో తేలాడు తుండటం, అడవిలో నుండి నక్క వెన్నెల వెలుగు లోకి ప్రవేశించడం వంటి సుందర మనోహర దృశ్యాలు కూడా కనిపిస్తుంటాయి.

జీవనానంద దాస్ కవిత కేవలం పాఠకుల హృదయాలను తాకటమే కాదు; బుద్ధి సూక్ష్మతను కూడా నిద్ర లేపుతుంది. కాలం లోనూ విశ్వావకాశం లోనూ గల వివిధ వస్తువులను ఊహలను స్వాభావికంగా హృదయంగమంగా కలిపి అల్లిక వేసినట్లు నూతన భావ చిత్రాలను చిత్రించడం ద్వారా ఆయన పాఠకుల హృదయాలను మనస్సులను పట్టుకుంటాడు. ఇంద్రియ స్వభావాలను వర్గీకరించి, సమ్మిళితం చేసి చూపుతాడు. ''వనలతా సేన్'' అనే కవితలో దీనికి ఉదాహరణ చూడవచ్చు.

> ''సాయం గోధూళి కప్పిన చెట్ల కొమ్మల సందుల మధ్య
> అపశకునాల ''రేవెన్''పక్షి రెక్కల మీద వాలిన సూర్యకిరణాల
> సువాసనలు తుడిచేసుకుంది.''

వీర సావర్కార్, నారిమన్ వంటి సమీప చారిత్రిక మహాపురుషులు, అత్తిలి వంటి పాత్రలతో కలిసి ఆయన కవితలో భుజం భుజం రాసుకుంటూ తిరుగుతారు. మార్క్స్, నాగార్జున, సంఘమిత్ర మొదలైన వారు, ''టైమ్స్ ఆఫ్ ఇండియా'', మధ్య ఆసియా లోని స్టెప్పీ ఎడారులు, ఒక బెంగాలు గ్రామం లోని చెరువు మొదలగు వాటిలో మిళితమై పోతారు. కేవలం ఊహాకల్పిత మైన సంఘటనలు వాస్తవాలుగా మన కండ్లకు భ్రమ గొల్పుతాయి. ఆయన కవితలో దొర్లే పేర్లకు లెక్కేలేదు. సుచేతన, అరుణిమా సన్యాల్, అనుపమ

త్రివేది, మృణాళిని ఘోషల్, సుబినామ్ ముస్తఫి, లోకేన్ బోస్, వనలతా సేన్ మొదలైన పేర్లు తరచుగా కనిపిస్తుంటాయి. వనలతా సేన్ గురించి ఆయనను ఆసక్తితో అనేక ప్రశ్నలు గుచ్చి గుచ్చి అడగడం కూడా తటస్థించింది.

జీవనానంద దాస్ కవితలో మొత్తం మీద చూస్తే పలాయన వాదం కనిపిస్తుందా అంటే కాదని గట్టిగా చెప్పవచ్చు.

"ఎక్కడో వినిపిస్తోంది ఎలుగెత్తి రెక్కల చప్పుడు
సముద్ర సంగీత నాదాలు శ్రవణ పేయంగా వినిపిస్తున్నాయి
ఎక్కడో మన కోసం ఉషస్సు వేచి కూచుంది"

అని చెప్పగల్గిన కవిని పలాయన వాది అని ఎవరనగలరు?

అనేక సార్లు మాటి మాటికి తన కవితలో జీవనానంద దాస్ మానవ జీవిత కష్ట పరిస్థితులను ప్రతిఫలింప జేస్తాడు. మానవుని జీవితపు అసమర్థ త్వానికి కించపడతాడు కాని భవిష్యత్తు మీద కొండంత ఆశతో ముందుకు పరుగుత్తుతాడు చూడండి.

"చీకటిని చిత్తు చేయాలని స్థిర చిత్తంతో వచ్చిన మనం
చీకటి భోగాలు మరిగి యిక్కడే స్థిరంగా వుండి పోదామా?
దాని ప్రాణాలు తీసే హంతకులం మనం
అవును : హంతకులం మనం
సముద్రం మీద పరుచుకున్న
అంతులేని యోజనాల అనంత దూరం లోని
పక్షులు నీళ్ళల్లోకి పరుగెత్తుతాయి
వెన్నెల వచ్చే లోగా
మనమూ అంతే పరుగెత్తు తుంటాం
చంద్ర దర్శనం మాట మరిచి పోయి
వెలుగు వచ్చే లోపలే అనంత కాలం లోకి
అడుగేసి ప్రవేశిస్తాం.

—"సూర్యునితో పోలిక"

మహాసముద్రం మీదిగా ఎగిరిపోతున్న ఈ పక్షి, జీవనానంద దాస్ కవితలో గూడు కట్టిన చారిత్రిక చైతన్యానికి సంకేతమని మనకు స్పష్టంగా సులభంగా తెలుస్తూనే వుంటుంది

జీవనానంద దాస్ కవితలో కనిపించే శబ్దజాలంలో "అయినా" లేక "ఐనప్పటికీ" అనే మాటలు తరచుగా కనిపిస్తుంటాయి. ప్రస్తుత మానవ జీవిత దుర్భర పరిస్థితికీ, దీని నుండి మానవుడికి విముక్తి లభిస్తుందనే ఆయన దృఢ విశ్వాసానికీ సేతువుగా ఈ మాటలు ఉపయోగ పడుతున్నాయి. మరీ ప్రారంభ కాలంలో రాసిన కవితల్లో జీవుని వేదన మరింత అధికంగా కనిపిస్తుంది. బ్రతుకు బాధ భరించ రానంతగా వున్నట్లు కనిపించి చరిత్ర కొట్టిన కొరడా దెబ్బలను తట్టుకోలేక ఆత్మ ఎక్కడి నుండి వచ్చిందో అక్కడికి, అంటే మృత్యు గహ్వరం లోకి, అంధకార గర్భం లోకి వెళ్లి పోవాలనే ఆకాంక్ష వెలిబుచ్చుతుంది. ఆయన కవితలో అప్పట్లో బాధకు తట్టుకోలేక వేసిన కేకలు బిగ్గరగా వినిపిస్తాయి. మృత్యువును ఆహ్వానించడంలో మొగమోటానికి తావు లేకుండా పోతుంది.

ఎదురుగ్గా కొండమీద ఎర్రగా మొలిచిన సూర్యుడు
ఎదుర్కో, ఓ జీవితాన్ని హెచ్చరిక చేస్తున్నాడు
లెమ్మంటున్నాడు
బ్రతుకు మీద యుద్ధానికి పొమ్మంటున్నాడు
జవాబుగా ఏముంది నా గుండెలో?
నిండిన తటాకంలా, దుఃఖం, ద్వేషం, క్రోధం, మోహం!
సూర్య కిరణాల శూలాల ఘాతాలకు ఘూర్ణిలుతూ
బల్లెపు పోట్లకు బలి అయిన వరాహంలా
భూదేవి వెర్రి కేకలు వేస్తోంది
పండుగ వాతావరణమో!
నా గుండె నిండా ఆవరించిన చీకటి సముద్రంలో
సూర్యుణ్ణి సుద్ద ముక్క లా ముంచేసి
మళ్ళీ నా నిద్రా ముద్ర లోకి

మరలి పోదా మనుకున్నాను .. .
అనంత శాశ్వత అంధకార గర్భంలో చేరి
నిద్రిద్దా మనుకున్నాను
అందులోనే మృత్యువు లాగా ఐక్యమవుదా మనుకున్నాను
ఏ నాటికీ మెలకువ రాని
యీ అనంత నిద్రా దీర్ఘ ముద్రలోకి వెళ్ళదలిచే
నన్నెందుకు లేపుతారు?
నన్నెందుకు పిలుస్తారు?

అలాంటిదే ఆయన కవితల్లో అంత తరచుగానూ వాడబడిన శబ్దం "ఎప్పుడో ఒకప్పుడు" అనేది. ఈ శబ్దం ద్వారా, ఏదో ఒక నాటికి మానవుడికి విముక్తి సిద్ధిస్తుందని కవి ధ్వనింప జేస్తాడు. అంటే కొంత కష్టకాలం గడిచిన తరువాత "ఎక్కడో మన కోసం ఉషస్సు వేచి వుంది." అయితే యీ బ్రతుకు బాధ, యీ కష్టాలు ఏమిటనే విషయం ఆయన ఎక్కడా నిర్వ చించలేదు. ఆయన కవితా స్వభావాన్ని పూర్తిగా పరిశీలన చేసి చూస్తే బ్రతుకులో నిజాయితీ, సాధ్యసాధనాల పవిత్రత వైపుగా ఆయన దృష్టి మర లించి ప్రబోధిస్తున్నాడనిపిస్తుంది. అదృష్టవశాత్తు మానవుడికి ఆత్మ అనేది వుంది; అందువల్లనే అతనికి విముక్తి లభిస్తుందని ఆయన భావం.

తన శవాన్ని తను మోసుకొస్తున్నాడు
యుగ యుగాలుగా మనిషి
అన్నల్ని చంపి, అక్కల్ని చంపి
రక్త దాహం తీర్చుకున్న మానవాత్మ
దుర్వాసనతో, దూరంగా వున్న ఆకాశాన్ని చూసి అరుస్తోంది
రక్షించమని కోరుతోంది నక్షత్రాలను
ప్రేమకోసం పరితపిస్తోంది
విజ్ఞానరోచిస్సుల్ని పిలిచి నెత్తురు మచ్చ తుడిచేయమంటోంది

ఆసలు అతను అడిగే వాడా, ఆత్మ అనేదే లేకుంటే?

— ఆనంద

ఇక్కడ కవి బెంగాలీ మూలంలో "హృది" అనే శబ్దం వాడాడు కాని ఆత్మ అని అనలేదు కాని ఆయన అవగాహనలో యీ రెండింటికి ఒక్కటే అర్థం వున్నట్లుంది. దేని బదులు దేని నైనా వాడవచ్చునన్నంత విశాలంగా యీ శబ్దాలను ఆయన భావించాడు.

భాషలోని పలుకుబడిలో రవీంద్రుని కంటె భిన్నమైన పలుకుబడి సాధించిన వాడైనప్పటికీ జీవనానంద దాసు యీ శబ్దార్థ సామ్య భావనలో రవీంద్రునికి చాలా చేరువుగా వచ్చా డనిపిస్తుంది. టాగూరు రచన "బుసకొట్టే పాములు" అనే దానితో "విచిత్రాంధకారం" అనే గీతాన్ని పోల్చిచూచుకోవచ్చు. ఈ యిద్దరిలో రవీంద్రుడే ఎక్కువగా పోరాట శక్తి గలవాడు. అయినప్పటికీ ఏ విలువలు నశించి పోవడం వారికి హృదయ విదారక మవుతుందో వాటి విషయంలో ఉభయుల మాట ఒక్కటే.

జీవనానంద దాస్ రచన "బాటసారి" అనే గీతం యీ యిద్దరి మధ్యగల సామ్యాన్ని నిస్సందేహంగా నిరూపిస్తున్నది. నశించని ఆత్మ భావనలో దృఢ విశ్వాసం, ఇహ లోకంలో అది చేసే జీవయాత్ర, ఆ యాత్ర అవధి లేని దనే భావన మొదలైన వాటిలో ఉభయుల ఆలోచనలు ఒకే మార్గంలో నడుస్తాయి. ఈ భావన రవీంద్రుడు వ్రాసిన అసంఖ్యాక మైన రచనలలో ప్రతిధ్వనిస్తూనే వుంటుంది. ఒక ఉదాహణ

"బాధా మృత్యువూ కలిసి బరువెక్కిన
ఈ చీకటి రాత్రి గర్భంలో
అప్పుడప్పుడు ఒక కిరణ లేశం
నన్ను చూసి మూగగా సంజ్ఞలు చేస్తుంది
ఆ సంజ్ఞల అర్థ మేమిటో అంతుబట్టని ఆశ్చర్యం నాకు!
దారిన పోయే దానయ్య కిటికి వేపు తలత్రిప్పితే
ఇంట్లో వెలిగే దీప కాంతి యింతో అంతో కనిపించినట్లు

ఆ కిరణలేశం నాగుండె గృహంలోని అట్టడుగు ద్వారాలు తెరిచి
మరిచిపోవద్దు నన్నన్నట్లు మళ్ళీ సైగ చేస్తుంది
ఈ చీకటి తెర తొలగిన వెంటనే
తెలివి వెలుగు కమ్ముకుంటుందిట-
కాలాతీత సుందరమైన కాంతి సముద్రపు అంచులమీద నుంచుని
సాయం రవి స్వచ్ఛత కోసం స్నానమాడుతున్నప్పుడు
అనంతకోటి నక్షత్రాలు దర్శనమిస్తాయి, నీటి మీది బుడగల్లా
ఆ రాత్రి మళ్ళీ ముసిరిన చీకటి తెర తొలగి పోతే
మళ్ళీ నేను మామూలు బాటసారినే
పంచేంద్రియ మహాజలధి ప్రారంభ నావికుణ్ణే.''

టాగూరు కావ్యం ''రోగశయ్య'' లో 20 వ గీతం.

జీవనానంద దాస్ జీవిత ప్రథమ భాగంలో ఉపనిషత్తులను తిరిగి ప్రచారంలోకి తెచ్చిన బ్రహ్మసమాజ మతవ్యాప్తి ప్రభావం చాలా ఎక్కువగా ఉండేది. రవీంద్రుడు దానిని ఇంకా ఉజ్జీవింప జేశాడు. దీని ఫలితంగా తత్సంబంధమైన కావ్యవస్తువు ఈ ఇద్దరు కవులూ వ్రాసిన కవిత్వంలో తరువాత కాలంలో తరచుగా కనిపిస్తుండేది. జీవనానంద దాస్, టాగూర్ లాగా (డాంటే మొదలగు ఇతర కవులుకూడా ఇంతే) విముక్తికి సంబంధించిన భావ చిత్రాలను స్త్రీలింగ వాచకాలుగా రూపొందించే వాడు. బహుశః ఇది సుచేతన పాత్రతో ప్రారంభమయింది అని కొందరు విమర్శకులంటారు. కవి చెప్పదలచిన విషయం యొక్క అనుకూల స్థితి ఇది. దీనిని జీవనానంద దాస్ కవితలో ప్రథమ దశగా భావిస్తారు. తరువాత సంవత్సరాల్లో ఆయన కవితలో యీ స్త్రీ మూర్తి కవితకు కేవలం ఒక ఆశ్రయం మాత్రంగానే ఉండకుండా, కవి దానితో తాదాత్మ్యం చెందే పరిస్థితి ఏర్పడి చీకటి గర్భం లోకి పోవాలనే మృత్యు కాంక్ష ఆవిర్భావానికి దారితీసింది. ఆదర్శానికి అంకిత మైన జీవితానికి ఒక సంకేత చిత్రంగా, దృశ్యమానం అవుతున్న అసహ్యకర పరిస్థితిని దాటిన ఒకానొక పవిత్ర దర్శనంగా మార్పుచెందింది.

జీవనానంద దాస్ ప్రారంభ కవితా దశలో కనిపించే వైరాగ్య భావన దాదాపు టాగూరు వంటిదే. 'ఝూరాపలక్' (రాలిన ఈకలు) అనే కావ్యంలో

దాదాపు చాలా కవితల్లోనూ, "దూసర్ పాండులిపి" (తలనెరిసిన వ్రాతప్రతి) అనే కావ్యంలోని కొన్ని రచనల్లోనూ టాగూరు రచించిన "నిర్ఝరేర్ స్వప్నభంగ" (నిద్రలేచిన సీటిజలలు) అనే కావ్యంలోని కవితలతో పోలి కలు వున్నాయి. జీవనానంద దాస్ కవితలను ఆయన తరానికి చెందిన సుధీంద్రనాథ దత్తా, విష్ణు డే, అమియ చక్రవర్తి మొదలగు కవులతో గానీ లేక తరువాతి తరానికి చెందిన సమరసేన్ కవితలతో గానీ పోల్చి చూసి నప్పుడు జీవనానంద దాస్ కవితలకు టాగూర్ కవితల్తో ఎంత పోలిక వుందో మనకు స్పష్టంగా కనిపిస్తుంది. పేర్కొన్న యితర కవులు చాలా నిగ్రహం తోనూ, ఆత్మ విశ్వాసంతో తమ దారి వెతుక్కున్నవారిగానూ, మేధోవంతులు గానూ కనిపిస్తారు. రవీంద్రనాథ టాగూరువలె, జీవనానంద్ దాస్ రాసిన ప్రారంభకాల కవితల్లో ఆవేశపూరితమైన వైరాగ్య భావన కనిపించినా ఏదో చెప్పాలనే తపన కూడా వుంది. రూపంలోగానీ, వస్తువులోగానీ స్పష్టత లేకపోయినా కొట్టవచ్చినట్లు కనిపించే శక్తి వాటిలో నిగూఢంగా వుంది ఈ యిద్దరు కవుల్లోనూ అనంతత్వం లోకి దూసుకు వెళ్ళాలనే అస్పష్టమైన కోర్కె ఏదో కొట్టుకు లాడుతుంటుంది. ఉభయుల కవితా జీవితంలోని మధ్య కాలాలలో వారి జీవిత దృక్పథమూ, అనుభూతి ప్రకటన లక్షణాలు క్రమంగా అవిష్కరింపబడి స్థిరత్వం పొందుతాయి. చివరి దశలో భావ పరిపక్వత, సందేహ విచ్ఛేదన, స్పష్టత, ప్రశాంత గాంభీర్యమూ స్థిరపడి పోయాయి.

తరువాత వచ్చిన తరాలకు చెందిన కవులందరిలోకి టాగూరు శిఖరాయ మానుడై కనిపించడానికి కారణం కేవలం ఆయనలో మనకు దర్శన మిచ్చే బహుముఖప్రజ్ఞా, ప్రతిభా సంపత్తి మాత్రమే కాదు. టాగూరుకు గల జీవిత తాత్త్విక చింతన, దర్శనం దానికి సంబంధించిన స్పష్టమైన అవగాహన జీవనానంద దాస్ కవితా భావనా పథంలో మనకు కనిపించదు. జీవనానంద దాస్ ప్రకటించిన ఆధ్యాత్మిక దృష్టి బహుముఖ ప్రజ్ఞావంతమూ కాదు; క్రమబద్ధమైందీ కాదు. ఆయన వ్యక్తిత్వంలో బుద్ధి బలాన్ని ఆవేశం వచ్చి ఆక్రమించుకునే లక్షణం ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. ఆయనలో తీవ్రంగా పెల్లుబికి వచ్చే ఆత్మాశ్రయ భావనా పద్ధతి ఆయనకు ఎంతో బలం సమకూర్చి పెట్టింది. కాని అదే ఆయన బలహీనత కూడా అయింది. షెల్లీ రచన 'పడమటి గాలిపాట' (ఓడ్ టు ది వెస్ట్ విండ్) అనే కవిత కూడా ప్రబల

ఆవేశ పూరితంగానే వుంటుంది. కాని తనకంటే వేరైన మరొక దేనినో సంబో ధించి రాస్తాడు. ఆ వేరైన దేదో తన మీద ఆధారపడి వుండదు. ఈ విధంగా అది వస్త్వాశ్రయంగా వుంటుంది. కాని జీవనానంద దాస్ రచన "గాలి వీచిన రాత్రి" లోని కథాంశం అంతా పూర్తిగా ఆత్మాశ్రయ లక్ష ణాన్ని కలిగి వుంది. కథాంశం కేవలం స్వీయానుభూతి చుట్టూ తిరుగు తుంటుంది షెల్లీ రచన 'బోనా పార్టీ పతనం: ఒక రిపబ్లికన్ మనోభావాలు' (ఫీలింగ్స్ ఆఫ్ ఎ రిపబ్లికన్ ఆన్ ది ఫాల్ ఆఫ్ ఎ బోనాపార్టీ) వంటిది గానీ, "ఆఫ్రికా" అనే టాగూరు రచన వంటిది గానీ జీవనానంద దాస్ జన్మలో రాయలేదు. ఆయన రాసిన "జూహూ", "అనుపమత్రివేది"వంటి అవహేళ నాత్మక రచనలు కూడా సమకాలీనులను గురించి డొంక తిరుగుడుగా వుంటాయే గానీ స్పష్టంగా వుండవు. అందులోనూ సెటైర్‌లో భాగస్వామి త్వమూ వుండదు జీవనానంద దాస్‌ను "ఏకాంతకవి" అన్నారు. "మహా కవి" అన్నారు. "యుగకవి" అన్నారు గాని ఎవరూ ఆయనను ఏదో ఒక రాజకీయ సాంఘిక తత్వానికి చెందిన వాడుగా గుర్తించ లేదు; ఆమోదించ లేదు. ఆయనకూ, సమకాలీన సంఘటనలకూ మధ్య ఏ విధమైన సంబంధం లేనట్లుగానే ఆయన కవితా వ్యాసంగం సాగింది. టాగూరులో అటువంటి సంబంధం వుంది. ఆధునిక కాలంలోని మానవుని దుస్థితిని గురించి ఆయనలో వేదన లేకపోలేదు. వర్తమాన చరిత్రను గురించిన స్పృహ వుంది. దానిని ఏ మాత్రం పట్టించుకోనట్లుగా వుంటాడు. ఏ ఒక్క సమకాలిక సంఘటనకు కూడా స్పందించని తత్వం ప్రదర్శిస్తాడు. అంతటి భావ తీవ్రత, అనుభూతి లక్షణం ప్రదర్శించిన కవిలో యిదొక విచిత్రమైన పరిస్థితిగా మనకు కనిపిస్తుంది.

తాను టాగూరు కవితా భావనకు చాలా దగ్గర వాణ్ణని ఆయన చెప్పుకున్నాడు. స్థూలంగా టాగూరు కూడా మానవుని స్థితిని గురించి విశ్వైకవేదనా భావనను అనేక విధాలుగా ప్రదర్శించాడు. కాని టాగూరు అనంతరకాలంలో, వాస్తవికతా దృక్పథానికి ప్రాధాన్యం లభించింది. వర్త మాన కాలంలో జరుగుతున్న సంఘటనలకు కవులు దగ్గరగా జరిగే పరిస్థితి వచ్చింది. కాని ఆ కాలపు కవులతో పోలిస్తే అప్పటి కవులకూ తత్కాల పరిస్థితులకూ వున్న సంబంధం జీవనానంద దాస్‌లో మృగ్యమైంది. ఆయన

లక్షణం వాటిని ముట్టినట్లుగానే వుండేది. ఆత్మయొక్క నాశనం లేని లక్షణమూ, మానవుని ఆధ్యాత్మికశక్తి నాశనం లేని దనే దృఢ విశ్వాసమూ ఆయన కాలంలో అత్యాధునికమైన ఒక సాంఘిక ఆలోచనా రీతిగా పోత పోయడానికి పనికి వచ్చాయి. ఆయన కాలానికి అవి తగివున్నట్లుగా కనిపించాయి. జీవనానంద దాస్ ప్రదర్శించిన నిరాశా, నిస్పృహలు, ఆయనలోని విశ్వమానవ సంపర్శన చైతన్యమూ కేవలం తాత్కాలికంగానే భాసించాయి. సమకాలీన సామాజిక విలువలపట్ల ఆయనకుగల అసంతృప్తి కేవలం వ్యక్తిగతమైనదిగా పరిశీలనాత్మకంగా మాత్రమే కనిపిస్తుంది. అయితే 'బాటసారి' వంటి కవితల్లోని ఆయన భావాల్లో నుంచి మనం కొంతవరకు రసం పిండుకోవచ్చుగాని, వ్యక్తి అనుభూతి నుండి ఏదైనా కొత్త భావనా వ్యవస్థ బైట పడుతుందా అని తరచి చూస్తే మాత్రం ఏమీ కనిపించదు. ఇతర కవుల కవితా భావనా ప్రకటనలు, ఒకానొక సాంఘిక రాజకీయ సిద్ధాంత సంబంధమైన తెచ్చికోలు ప్రతిధ్వనులుగా వున్నందున బోలుగా కనిపిస్తాయి ఆ లక్షణం లేకపోయినా, జీవనానంద దాస్ భావనలు కూడా అంతే బోలుగా వుంటాయి. ఎందుకంటే వాటిలో స్పష్టత గానీ, సొంత గొంతుకగానీ కనిపించదు, వినిపించదు. "బాటసారి" అనే గీతంలోగానీ "రెండుమార్గాలు" అనే కవితలోగానీ కనిపించే భావ చిత్రాల మీద అంతకు ముందువలె జీవనానంద దాస్ ప్రత్యేక ముద్ర కనిపించదు. ఆయన శబ్దప్రయోగ కౌశలం క్రమంగా టాగూరుకు దగ్గరగా చేరుకోటానికి ప్రయత్నించినట్లు కనిపిస్తుంది.

జీవనానంద దాస్ కవితా భావన అంతా టాగూరు భావన, బ్రహ్మ సమాజ భావన వంటి ఆ కాలపు ప్రధాన భావ ప్రవాహాలలో పడి కొట్టుకుపోతున్నట్లుంటుంది గాని స్వీయ ముద్రాంకితంగా వుండలేక పోయింది. ఉపనిషత్తులు ప్రబోధించిన సమన్వయ సిద్ధాంతం విఫలమైన పరిస్థితిని చూసి రవీంద్రుడు కోపావేశం పొంది "శాంతి వచనాలు" "బుసకొడుతున్న పాముల" ముందు ఎందుకూ పనికిరావని చెప్పుతూ రాక్షసత్వాన్ని ఎదిరించి పోరాటం సలుప వలసిందని పిలుపు యిచ్చాడు. దీనికి చాలా కాలం తర్వాత కూడా జీవనానంద దాస్ కవితా దాహం టాగూర్ ప్రతిపాదించిన విలువల స్థూల స్వరూపాన్ని పునరుద్ధరింప జేయడానికే పరిమితమై పోయింది. జీవనానంద దాస్ రచనలో అత్యుత్తమమైన వాటిని సంకలనం చేసి ప్రామాణిక

గ్రంథంగా ప్రచురించిన కావ్యంలో కూడా చివరి కవితలో ముగింపు ఎలా వుందో చూడండి.

"ఈ ప్రపంచ భీకరారావం ద్వారా వచ్చిన
నాశం లేని అనాది నాద శక్తి
వెలుగుకు లొంగి, ఆనందానికి పొంగి మూగవోయిన దానిలా
అనంత కరుణా సముద్రంమీద అలల్తో గుసగుసలాడుతోంది"

— "రెండు మార్గాలు"

స్వాతంత్ర్యానంతర భారతదేశంలో రవీంద్రుడు నిర్మించిన కవిత్వపు విలువల సౌధం గట్టిగా నిలబడ లేక కూలిపోతూ ప్రకటించిన వేదనా శబ్దాల చిహ్నంగా, ఆ విలువల వైఫల్యానికి ప్రతీకగా మనం జీవనానంద దాస్ కవితను సంభావించుకోవచ్చు. జీవనానంద దాస్ డబ్ల్యు. బి. ఈట్స్ కవిని చాలా మెచ్చుకునేవాడు. ఈట్స్ కవిలాగా జీవనానంద దాస్ కూడా పరివేదన ప్రకటిస్తాడు.

"సిలికండ్ల కాలం కాంత స్వైర విహారం చేస్తోంది
విజాయితీని యీదుతూ యీదుతూ నీటిలో మునిగిపోయింది
ఇన్నింతలో మంచివాళ్ళు విడాకు లిచ్చారు లక్ష్యానికి
చెడ్డవాళ్ళు సరేసరి, భోగాల బోనులో ఎప్పుడో చిక్కారు"

జీవనానంద దాస్ పలాయన వాద కవి అని చెప్పడం, మానవ జాతి దుఃఖంపట్ల ఆయన పొందిన ఆవేదనను తిరస్కరించడం సులభమే కాని న్యాయం కాదు. ఆయన కవిత సామాజిక కావ్యవస్తు స్పృహకు గానీ, లేక దానికి సంబంధించిన కవితా నినాదాలకు గానీ సంబంధించినది కాదు. కాని అందులో వుండే శక్తి ఏమిటంటే బాధతో పడే ఆవేదనాంశం, దానిని భావించడంలో ఆయన చేసే అనుభూతి ప్రకటన, అందులోని సమకాలీన, వ్యక్త్యనుభూతి గత సౌందర్య వాసనా బలం, కవి దానితో తాదాత్మ్యం చెందే స్థితి. వీటికి ఆయన కవిత అద్దం లాంటిది.

కాని ఊహాకాశాల ఎత్తుల్లోకి ఎగరడంలో యితర కవులందరి కంటే ఆయన ఎంతో ఉన్నతుడు కావడంవల్ల ఆయన సిద్ధాంతాలు, కవితా తత్వం జోలికి పోకుండా కవిగా మాత్రమే చూడడానికి అవకాశం వుంది. 'కల' అనే ఖండికలోని సున్నితత్వమూ, అంతర్ముఖీనత, "ముగ్గురు ముష్టివాళ్ళు" అనే కవిత లోని వ్యంగ్యవైభవం, "అనుపమ త్రివేది" లోని కథా కథన శిల్పము, "విశ్వవిద్యాలయ ఆచార్యుడు" కవితలోని అవహేళన, "గాలిపటం" గీతం లోని పవిత్రత, అమాయకత, "గాలి వీచిన రాత్రి" లోని కల్పనా కలిత వైరాగ్య భావన, "వనలతా సేన్" లోని నిగ్రహశక్తి, "విచిత్రాంధకారం" లోని కోపభావ ప్రదర్శన, "పెంపుడు పిల్లి" లోని నగర వాతావరణ దర్శనం, "నారింజ పండు" గీతం లోని గంభీర సారళ్యం, "సూర్యునితో పోలిక" లో సాధారణంగానే అయినా ప్రబోధ నినాదాత్మకత - ఇవన్నీ జీవనా నంద దాస్ భావనలోని తీవ్రతకూ, గాంభీర్యానికీ, శైలి శక్తికీ దృక్పథ వైవి ధ్యానికీ నిదర్శనాలు. జీవనానందదాస్ కవితలో భావానుభూతి, గ్రామీణ మైన అమాయకత, ప్రకృతి ఆరాధన కనిపిస్తాయి. నిశిత పరిశీలనా శక్తి, గ్రామీణ వాతావరణ సమగ్ర విజ్ఞానం ఆయన సొమ్ములు. విశ్వ కాలా వధుల వీథుల్లో సంచరించే సమకాలీన నాగరిక చైతన్యం ఆయనది. తన పరిసరాలతో తాదాత్మ్యం చెంద దలచిన ప్రాంతీయ భావనా చైతన్యం గుత్తకు గొన్న కవి జీవనానంద దాస్. మానవజాతి భవితవ్యం గురించి బాధపడే విశ్వచైతన్య శక్తికి ఆయన ప్రతీక. ఆధ్యాత్మిక భావ సముదాయా లను అత్యంత రమణీయ కవితా రూపాల లోకి పోత పోయగల విశిష్ట నైపు ణ్యంతో కూడిన మేధావి జీవనానంద దాస్. సంప్రదాయంలో మునిగి తేలు తూనే తామరాకు మీద నీటి బిందువులా తప్పించుకోగల నేర్పరితనం గల మహాకవి జీవనానంద దాస్.

హృదయస్పర్శి యయిన అంతటి భావనా తీవ్రతతో కవితా భాగీరథీ పావిత్ర్యాన్ని వివిధ కోణాలతో సందర్శించి ప్రదర్శించ గలగడం ఏ కవి కైనా దాదాపు అసాధ్యం ఆయన సమకాలీన కవుల్లో మరెవరైనా యింత శక్తి ప్రదర్శించ గలిగారా అంటే అనుమానమే.

# అనువాదకుల అవస్థలు

జీవనానంద దాస్ బెంగాలీ కవి. ఏ భాషలోనైనా ఆ భాషా సంప్రదాయమూ, నుడికారమూ తెలిసిన ఆ ప్రజలకు అర్థమైనట్లుగా కవి భావం అనువాదాల ద్వారా యితర భాషలు మాట్లాడే ప్రజల అవగాహన పరిధిలోకి పోలేదు అందులోనూ కవిత్వాన్ని అనువదించడం కత్తిమీద నడకే. అనువాదకుడు కేవలం కవి దేహాన్ని మాత్రమే బైటికి తీసి చూపించ గలుగుతాడు. కవి ఆత్మను నూటికి నూరుపాళ్లు ఆవిష్కరించడం అసాధ్యం. యదాతథంగా 'తూచా' తప్పకుండా అనువదిస్తే అది తెనుగు భాషలాగా వుండదు. కృత్రిమత్వం గూడు కట్టుకుని వెగటు కలిగిస్తుంది. గురికి బెత్తెడు ఎడంగా వెళ్ళడం కంటే అనువాదకునికి గత్యంతరం లేదు. అనువాదకునికి ఆ హక్కు వుందా లేదా అనేది చర్చనీయాంశం కాని యీ అనువాదంలో నేను అనుసరించిన పద్ధతి యిదే. సాధ్యమైనంత వరకు, తెలుగు పాఠకుడు చదువుకున్నప్పుడు అది తెలుగు కవితగా భాసింపజేయాలనేదే నా ప్రయత్నం ఇటువంటి స్వేచ్ఛ నేను తీసుకున్నందువల్ల అసలు కవికి శతాంశమో, సహస్రాంశమో అన్యాయం జరిగి వుండవచ్చు. కాని వివిధ భాషలున్న మన దేశంలో ఒకరినొకరు అర్థం చేసుకోవాలంటే యీ మాత్రం కష్టాన్నీ, నష్టాన్నీ భరించక తప్పదు. నిజానికి ఒక భాషలోని కవిత్వం ఆ భాష మాట్లాడే ప్రజలకే తెలియడం కష్టం ఆలోచించే కొలది కొత్త అర్థాలు పుట్టుకు వచ్చే కవిత్వం అనే దాని స్థూలమైన అర్థాన్ని గ్రహించడం సులభమే. అంతరార్థాలు ఆ భాష ప్రజలకే తెలియకపోవచ్చు. అటువంటి పరిస్థితిలో బెంగాలీ భాష నుండి ఆంగ్లంలోకి చేసిన అనువాదం ద్వారా నేను దీనిని తెలుగు చేయవలసి వచ్చింది. కొన్ని చోట్ల ఆయన క్లుప్తంగా చెప్పిన దాన్ని సాగదీయడం, వివరంగా చెప్పిన దాన్ని క్లుప్తీకరించడం, ఆంగ్లమూలం లోని కొన్ని పద చిత్రా

లను తెనుగు భాషకు అన్వయించే రీతిలో మార్చుకోవడం మొదలైనవి జరిగి వుంటాయి. అయినా జీవనానంద దాస్ వ్యక్తిత్వమూ, కవితా రీతి, పద చిత్రాల గుంభన, మూలతత్వ స్వభావమూ స్థూలంగా తెలుసుకొనడానికి యీ అనువాదం తెలుగు ప్రజలకు సహాయకం అవుతుందనడంలో సందేహం లేదు. భాషలో కూడా నేటి ఆధునిక అభిప్రాయాలకు అనుగుణంగా సాధ్యమైనంతవరకు ప్రజల అవగాహన పరిధికి దగ్గిరగానే నేను సంచరించాను దాదాపుగా తెలుగు ప్రజలు మాట్లాడే రీతిలో, ఉచ్చరించే రీతిలో రాయడం నాకు అలవాటు. మన వ్యవహారిక భాషోద్యమ లక్ష్యం యిదే. దీనిని కవితలో కూడానా అంటే, అవును, కూడా. బెంగాలీ మాతృకలో వుండే ఛంద స్సౌందర్యం గానీ, నడక తీరు గానీ, శబ్దలయగానీ, భావాల పోహళింపు గానీ, ఆంగ్లాను వాదంలో గాని, యీ అనువాదంలోగానీ ఆశించలేము. స్థూలంగా చూస్తే, జీవనానంద దాసు మన భావకవుల కవితా పద్ధతికి చెందినవాడు నూతన పద చిత్రాలను సృష్టించడంలో అప్రతిమానుడుగా కనిపిస్తాడు ఆయనను ఆ మాత్రం అర్థం చేసుకోడానికి యీ అనువాదం తోడ్పడితే కృషి ఫలించినట్లే.

జాతీయ సమైక్యతా కృషిలో యీ అనువాద కార్యక్రమం ఎన్ని లోపాలున్నా యిలా జరుగుతూ వుండవలసిందే.

— కుందుర్తి

# మృత్యు పరిష్వంగానికి ముందు

నడుస్తూ నడుస్తూ పొలాల్లో గడ్డి వాముల మధ్య
ఒక శీతాకాలపు సంధ్యారాగ కాంతుల్లో
నది ఒడ్డున మంచు పూలు వెదజల్లుతున్న
నారీ రత్నాలను
సుదూర గ్రామ సీమల సుందరీ మణుల్ని
గతించిన కాలం లోని కళావ రేకుల కన్నుల వారిని చూసిన మేం

చెట్ల కొమ్మల సందుల్లో ఎగిరే మిణుగురుల దీప కాంతిలో
పైరింకా పెరగని పొలాల మీద తిరిగే చంద్రుణ్ణి తనివితీర చూసిన మేం

చలి కాలపు దీర్ఘరాత్రుల మీద సరదాపడి తిరుగుతూ తిరుగుతూ
అర్ధరాత్రి గడ్డికుప్పల మీద ముసలి గుడ్లగూబ రెక్కల చప్పుళ్లు విన్న మేం

క్షణంలో మాయమై అది చీకట్లో కలిసిన దృశ్యాలు చూసిన మేం

పొలాల మీద పొలాలు సముద్రాల్లా దాటిపోతూ
ఎగిరే పక్షుల పక్ష సంగీతాలు వింటూ
చలి కాలపు రాత్రి లోని సౌరభం ఆఘ్రాణిస్తూ
సౌందర్యం ఆస్వాదిస్తూ
పురాతన వృక్షశాఖల మీద కొంగ కూతలు విన్న మేం

జీవకోటి దాచుకున్న అనంత రహస్యాల్లోకి
అసంఖ్యాకమైన అద్భుతాల్లోకి
ఆనందంగా తొంగి చూసిన మేం

అందులో తలమునకలైన మేం

వేటగాడు వదిలిన బాణాల గురి తప్పించుకుని
అవనీస్థలి అంచుల దాకా వెన్నెలలోకి దూసుకు పోయిన
అడవి బాతు సమయస్ఫూర్తికి ఆశ్చర్యపడ్డ మేం

పండబారిన కంకుల్ని విందు మనసుతో తాకి చూసి
చీకటి పడే సమయానికి గూళ్ళకు చేరే పక్షుల్లా
ఊళ్ళోకి చేరి పంట కోర్కెల గూళ్ళల్లోకి దూరిన మేం

పసికూన ముఖ పరిమళాలు
గడ్డిపూల సౌరభాలు
సూర్యుడూ, పక్షులూ, నక్షత్రాలూ, ఆకాశం
ఒకటేమిటి, అన్నింటి లోని ఒయ్యారాలు తియ్యగా తిన్న మేం

ఋతుచక్ర పరిభ్రమణంలో మారుతున్న ప్రకృతి ఒడిలో
శిశిరంలో పాలిపోయి రాలుతున్న ఆకులు చూసిన మేం

కిటికీ కిటికి సాగిన చెట్ల కొమ్మల మీద
వెలుగుతో దోబూచులాడే పక్షుల కిలకిలా రావాలు విన్న మేం

పిండిలో పొర్లాడి తెల్లరంగు పులుముకున్న మూషికరాజును చూసిన మేం

నీటిలో ఏకాంతంగా యీదే చేప కన్నెల నేత్రాల్లోకి
అలల ద్వారా చొచ్చుకు పోయిన ధాన్యపు సుగంధాలు దర్శించిన మేం

ఏ అదృశ్య కన్యకామణి మృదుల హస్తమో దువ్వి జోకొట్టినట్లు
సరస్సులో రాజహంస నిద్రా ముద్రలో మునిగి పోవటం
మేఘ మాలలు గోపురాగ్రాల్లా బంగారు పతంగులను
తమ యిండ్లకు ఆహ్వానించడం చూచిన మేం

భూమ్మీద ఉల్లుకుంటున్న పూల తీగల ప్రకృతి గృహాల్లో
పిచ్చుకలు గ్రుడ్లు పెట్టి పొదుగుతూ ఉండడం

నదీమతల్లి తీరాల ముద్దుపాపల్ని నీటి పరిమళాలలో స్నానం చేయించడం
దొడ్లో పరచుకున్న వెన్నెల పాలరాతి ఫలకం మీద
పూరి గుడిసెల పేదలు శిల్పాల ముద్దల్లా పొరాడడం చూసిన మేం

సముద్ర తీరాన ఉప్పు కుప్పల మీద
కోరికల కన్నీళ్ళు దళసరి మంచు కార్చటం చూసిన మేం

పొలాల్లో పారాడుతున్న గొల్లభామ పురుగుల వాసనల్తో
గాలి గంభీరంగా వీస్తున్నప్పుడు
చెటకు వ్రేలాడుతున్న అరుణ ఫల జాతుల ప్రతిబింబాలు
ఏటి నీటిలో చూసుకుంటూ పొలాలు మురిసిపోతుండడం చూసిన మేం

భూ మార్గాలమీద ప్రసరించే తన నీడల్ని చూసుకుంటూ
నింగి లోకి యింకా ఎత్తుగా నీలాకాశం పెరిగి పోవడం చూసిన మేం

తమలపాకుల తోటల్లోకి సాంధ్యారాగం చొచ్చిన తీరు చూసిన మేం
ధాన్యపు కంకుల గుత్తుల్లా స్వచ్ఛంగా
ఉదయకాంతి పుంజాలు ఉబికి వచ్చిన రీతి చూసిన మేం

దినాంత మాపాంత ఋత్వంతాల్లో
నదుల నీటి ప్రవాహాల గుసగుసల సంకేతాలతో
పుడమి తల్లి పంట కూతురు పెరగడం తెలుసుకున్న మేం

పొలాల కవతల, పథాల వెనుకగా
చెరువు మెట్ల చివరి భాగంలో
సాయంత్రానికి పాలిపోయే, చూపు కందక వాలిపోయే
ఏదో వెలుగు ధగద్ధగాయమానంగా మెరవడం చూసిన మేం

ఆ నిశ్ఛల కాంతి పుంజం దగ్గర లోపే అందాల కుప్పలు కన్యకామణులు

ధూప పరిమళ దేహాలతో దూరంగా కనిపిస్తుంటే ..
ఇంతకు మించి నేర్చే దేమిటి మృత్యు పరిష్వంగానికి ముందు?
ఎర్రగా ఎత్తుగా పెరిగిన ప్రతి కోర్కెకు ప్రక్కన గోడలా
నల్లని మృత్యు ముఖం దాక్కుందని నరులైన మనకు తెలేదా?
మనిషి మనసులో పండే కలలూ ఐహిక భోగాల బంగారు ఛాయలూ
ఒకే మహా ప్రశాంత నిశ్చల యోగస్థితిలో
సమతూకంలో ఉంటాయని సమస్త ప్రజలకు తెలేదా?
ఒక విచిత్రమైన అవసరం ముగిసినట్లు తెలేదా?

ఇంకా ఏమిటి తెలుసుకునేదిమృత్యు పరిష్వంగానికి ముందు?
అస్తమయ సూర్యుడి చెవులు చిల్లులు పడే విధంగా
పక్షులు గొంతెత్తి పలవరించడం వినలేదా?
కప్పిన మంచు తెరను చీల్చుకుంటూ కాకి ఎగిరి పోవడం చూడలేదా?

## రా బం దు లు

ఆశియా ఖండపు అందాల ఆకాశ వీధుల్లో
సాయంత్రపు చల్లని ఎండల్లో
దేశదేశాల సరిహద్దు రేఖలు కలిసే చోట
రాబందులు రాజ్యం చేస్తూ ఎగురుతుంటాయి....

మానవ నివాసాలకు దూరదూరంగా
భూగోళం మీది నిశ్శబ్ద మంతా

ఆకుపచ్చని మైదానాల మీద
మరో ఆకాశంగా ఆవరించుకున్న చోట
హాయిగా ఆనందంగా దిగుతాయి రాబందులు
నీలి మేఘాల నింగి లోంచి నిశ్శబ్దంగా తొంగిచూస్తూ

ఆకాశ హర్మ్యాల సంరక్షణకు
అక్కడ నిలిచిన గజదళం కాబోలు
హఠాత్తుగా భూమ్మీదికి దిగి
తాటి తోపుల మీదిగా గిరి శిఖరాలకు మళ్లీ ప్రాకి
సముద్రంమీద విహరిస్తూ
వచ్చి పోయే ఓడల్ని వరుసగా పరామర్శిస్తుంటాయి

మృత్యువంటే బెదిరి పరువెత్తే అల్పజాతి పక్షులు
తెల్లమొగాలు వేసి దిగాలుపడి చూస్తుంటే
అంతెత్తున రాబందులు గుడి గోపురాలకు ప్రదక్షిణిస్తూ
మృత్యువుతో రెక్కల కరచాలనం చేస్తూ
ఆకాశమంతా ఆవరించుకుంటాయి

వాటి వైపు చూస్తూ భూమ్మీద పారుతున్నది
తన్మయత్వపు నది కాబోలు

సముద్ర జీవన బంధం వదిలించుకున్న
ఉప్పు నీటి కయ్య కాబోలు

అంతలోనే రాబందులు అంతెత్తుగా పోయి
నీలి మేఘాల ఆవరణలో లీలగా కలిసిపోతాయి.

## వనలతా సేన్

శతానేక బ్రహ్మ కల్పాలు గతంలో కలిసి పోక ముందే
ఈ భూమ్మీద కాలం పరిచిన గులక రాళ్ళ రస్తాల వెంట
ఓపికతో ఒక్కణ్ణే ఒంటరిగా ఆనాడు తిరుగుతూ
సింహళ సముద్ర తీరం నుండి
చీకటి రాత్రుల్లో జీవకళలు విరుగుతూ
మలయా జలసంధి దాకా
మత్తుగా నడుస్తుండే వాణ్ణి

కాలం గోశలతో కట్టి, క్షణక్షణం
కదుల్తున్న చీకటి వరండాలో
బింబిసార, అశోక సామ్రాట్టుల ఆజ్ఞలు
పొగమంచుగా కండ్లల్లో పొడుస్తున్న చోట
చిక్కిపోయిన విదర్భలో చిమ్మ చీకటి పరుచుకున్నప్పుడు
అప్పుడు నేను ఒక్కణ్ణే అంతటా తిరుగుతుండేవాణ్ణి

ఆ నాటి కోప ఘూర్ణిత సముద్ర తరంగ ఘోషలు
ప్రళయంగా యింకా నాలో ప్రతిధ్వనిస్తూనే వున్నాయి
అప్పట్లో నాకు కలిగిన మనశ్శాంతి ఒకే ఒక్కచోట
నాటూరులో వనలతా సేన్ నన్ను ఆలింగనం చేసుకున్నచోట

విదిశలో అర్ధ రాత్రిలా
ఆమె శిరోజాలు చీకటి విరజిమ్ముతున్నాయి
శ్రావస్తిలో శిలా ఖండాల మీద చెక్కిన
కళా సరస్వతి కండ్లలా
ఆమె మోము నిశ్చలంగా వుంది

తుఫాను వెలిసిన మహా సముద్ర మధ్యంలో
చుక్కాని లేకుండా నడిపే నావికుడిలా వుందామె:
చెట్లూ చేమలూ పూపొదలు ఆకు జొంపాలతో
హరిత వర్ణ సముద్రంలో తేలాడుతున్న ద్వీపంలా వుంది

"ఇన్నాళ్లుగా ఎక్కడున్నావ్" అడిగింది వనలతా వేన్ ఆశ్చర్యంగా
మరెన్నో ప్రశ్నలు మౌనంగా అడిగింది
పిచ్చుక గూళ్ళ వంటి అందమైన కళ్ళతో

సాయం గోధూళి కప్పిన చెట్ల కొమ్మల సందుల మధ్య
అపశకునాల రేవెన్ పక్షి
రెక్కల మీద వాలిన సూర్య కిరణాల సువాసనలు తుడిచేసుకుంది
రకరకాల శబ్దాలు సద్దుమణిగాయి

మిణుగురుల వెలుగు చారల కాగితాల మీద
రాత్రి కథల సంపుటానికి చిత్తు ప్రతి తయారైంది
ప్రతి పక్షీ గూడు చేరుకుంది. ప్రతినదీ జలధిలో కలిసింది
చీకటి అలానే వుంది; ఇదే మంచి సమయం వనలతా వేన్‌కు.

## నారింజపండు

ఒకసారి మరణిస్తే నేను
మళ్ళీ వస్తుందా భూమ్మీదికి యీ మేను ?

వస్తుందే అనుకుందాం పోనీ
ఒక చలి కాలపు రాత్రి వేళ
మరణ శయ్య ప్రక్క టేబిల్ మీద
సగం తిని శల్యావశిష్టమైన
నారింజ పండులా నన్ను రానీయండి.

## సుచేతన

నువ్వున్నావు సుచేతనా, మెరుస్తున్నావు
వింగి అనే సముద్రపు నీళ్ళల్లో తేలాడుతున్న ద్వీపంలా
మెరిసే నక్షత్రం లాగ
నువ్వున్నావు సుచేతనా, మెరుపులాగ, మరుపులాగ
దూరాన దాశన చెట్ల అడవిలోని పరిమళాలు మోసుకుంటూ
శాంతి గాలి చల్లగా వీస్తున్న చోట
నువ్వున్నావు సుచేతనా

జగతి శ్రమించడం నిజమే
స్వేదం కారుతున్నది నిజమే
మనిషి కీర్తివంతుడు నిజమే
అత్యంత వైభవోపేతుడు నిజమే
అయినా పరమ సత్యాలు అవే కావు
పరమార్థం అదే కాదు
ఏ నాటికో ఝా కలకత్తా మహా నగరం
స్వర్గధామంగా మారినా సరే
నా హృదయం నీతోనే వుంటుంది

స్వర్గానికైనా రానంటుంది
నేనూ కృషిచేశాను యీ మనిషిని మారుద్దామని
అరికాళ్లు మంట లెత్తేట్లు అన్నిచోట్లా తిరిగాను
యీ మనిషిని మేల్కొల్పుదామని
ఎంతలో తల మాడుతోంటే సర్వత్ర సంశోధించాను

ఈ మనిషిని ప్రేమిద్దామని పోతే
వీడు నిర్జీవ శవంలా గున్నాడు
నేనే వీణ్ణి స్వయంగా చంపానా ?
లోకం నిండా బాధ పరుచుకుని వుండెందుకు ?
జీవితం ఖాయిలా పడిందా ?
అయినా దానికి మనం ఋణపడి వున్నాం
దానితోనే కలిసి వుందాం

మానవ కళేబరాల సరుకు నింపుకుని
ఓడలు రేవుల్లో లంగరేసి నిలిచి వున్నాయి
దాన్ని వాళ్ళు బంగారంగా మార్చుకుంటారు
ఆశ్చర్యపడతాం మనం, బుద్ధుడిలా, కన్ఫ్యూషియస్‌లా

అయినా యీ లోకం ఎందుకో
ఆకర్షిస్తూ పిలుస్తూనే వుంటుంది

జీవిత శిఖరం చేరుకునే దారి
యిటువైపుగా వుంది సుచేతనా !

ఇదేసుమా ముక్తి మార్గం ...
యుగయుగాల సాధన ఫలితం
మహామహుల శ్రమ ఫలితం ...

ఈ లేత ఎండల చిరుగాలి
ఎంత హాయిగా వుంది!
ఇలాంటి జీవిత సౌధం
మనం సొంతగా నిర్మించుకుందాం
అప్పుడే కాదు, తొందర లేదు
ఆ రోజు వస్తుంది

ఈ నేల నన్ను పిలిచింది
ఇక్కడ పుట్టమని
వద్దు వద్దు అనుకుంటూనే
వచ్చేశాను ఎందుకో!

ఇప్పటికే నాకు యీ మహార్థం తెలిసింది
ఆకుల మీద మెరుస్తున్న మంచు బిందువుల్ని
మనిద్ర వేళ్ళతో ముట్టుకున్నాను

ఏం జరగ బోతోందో
అప్పుడు నాక్కనిపించింది
అది జరిగి తీరాలని ఎక్కడా
రాసి లేదనీ అనిపించింది
ఏం జరగ బోతోందో
అప్పుడు నాక్కనిపించింది-

కాలాతీతమైన అజ్ఞానాంధకారంలో
విజ్ఞానపు వెలుగుల ఉష ఉదయం.

## నిరంతర ప్రయాణం

రాత్రి కాంత చెవులో వూదిన
ఏ గుసగుసలు వినిపించాయో
ఇలా తిరుగుతున్నాను నగరం నడిరోడ్ల మీద
ఏకాంతంలో 'నా' అనే వాడు లేని ప్రాంతంలో ..

క్రమం తప్పకుండా పగలల్లా బస్సులు పాపం, పరుగెత్తి పరుగెత్తి
ట్రామ్ బండ్లు సరీసృపాల్లా జరజరా ప్రాకి ప్రాకి
అలసి సొలసి, ఒడలంతా బడలికతో
కలసి పోతాయి నిద్రా లోక నిశీథంలో
రాత్రంతా గ్యాస్ లైట్లు విశ్వాసంతో వెలుగుతుంటాయి
స్వధర్మ నిర్వహణ దీక్షా సంతృప్తితో
పగలంతా రెప్పలార్పక లోకాన్ని చూసి చూసి
తలుపులు, కిటికీల కను రెప్పల్ని మూవేసి విశ్రమిస్తాయి యిండ్లు
రాత్రిపూట శవాల్లా పడివున్న వీధుల వెంట నడుస్తూంటే
నా నరనరాల్లో ప్రతిధ్వనిస్తుంది నిశీథ నిశ్శబ్ద ప్రశాంత సంగీతం!
నక్షత్ర కాంతులలో ధగధగా మెరుస్తున్న
ఈ గోపురాల నగరంలో....
వీధులన్నీ వింతగా ఒకచోట కలిసి
గోపురాల చుట్టూ చేరి గుసగుస లాడుకుంటాయి

రాత్రి కాంత చెవులో వూదిన
ఏ గుసగుసలు వినిపించాయో
ఇలా తిరుగుతున్నాను నగరం నడిరోడ్ల మీద!

ఒకసారి క్రిందికి చూస్తాను
గాలి తోసిన ఎండు గడ్డి
కాలుతున్న సిగరెట్ ముక్కతో కయ్యమాడుతుంటుంది
చూడలేక కండ్లు మూసుకుంటాను
మరో ప్రక్కకి నక్కి చూస్తాను
చెట్టు క్రింద గలగలా రాలి పడిన ఆకులు
గంతేసి దూరంగా పరుగెత్తు తుంటాయి
చూడలేక కండ్లు మూసుకుంటాను
ఈ అనంత నిశీధ నిశ్శబ్ద సౌందర్యంలో
ఎందుకు నే నిలా తిరుగుతున్నాను
బాబిలాన్ వీధుల గుండా
కలకత్తా వీధులగుండా
శతాబ్దాల క్రితం తెలిసిన దాని కంటే
ఎక్కువేం తెలిపింది యిప్పుడు నాకు?

## శవ సామ్రాజ్యం

ఇక్కడే .యిదుగో యిక్కడే ... ...
చంద్ర బింబం రాలి పడి నీటిలో మునిగి
కలుపు మొక్కల గుంపుల మధ్య తలదాచుకున్న చోట

స్థిర నివాసం కోసం ఆరాట పడి
దోమ దొంతరలు యిండ్లు కట్టుకున్న చోట

కోర్కె బైటికి పొక్కకుండా గుండెల్లోనే దాచుకుని
చేప కన్నెలు దోమ రాజుల్ని కాపేస్తున్న చోట

మౌనంగా నిద్రించే మత్స్య కన్యల కనుగొలకుల కాంతుల్తో
ప్రపంచపు యీ యిరుకు మూలలో
నదీమతల్లి ఏకాంతంగా లోతుగా
తనలోకి తాను చూసుకుంటున్న చోట

పక్కనే పంట పొలంలో పారుతున్న నీళ్ళు
ఆకాశం లోని మబ్బుల వేపు అనంతంగా చూస్తున్న చోట

మినుకు మనే నక్షత్రాల వెలుగులో ఆకాశ కాంత
చీకటి శిరోజాల చివర్లు సవరించుకుంటున్న చోట ...

ఇక్కడే . . యిదుగో యిక్కడే
లోకంలో యింకా ఎన్నో నదులున్నాయి - ఈ నది
నేల మీద పరచుకున్న ఎర్రటి మేఘం మీద
తెల్లటి వెన్నెల కుప్పలు తీర్చి దిద్దుకున్నట్లుంది

లోకం లోని వెలుగులూ, చీకట్లన్నీ
ఇక్కడికి చేరగానే అంత మవుతున్నాయి
ఎరుపు, నీలం రంగు చేపలూ యీ యెర్రటి మబ్బు తునక
ఇవే చివరకు మిగుల్తున్నాయి

ఇక్కడే అనంతంగా నీళ్లలో తేలుతూ
మృణాళినీ ఘోషక్ శవం
ఎర్రగా, నీలంగా
వెండిపూతలా, వెన్నెలలా
మృదువుగా, మౌనంగా .......

## పెంపుడు పిల్లి

చెట్ల క్రింద నీడల్లోనో, ఆరు బయట ఎండల్లోనో
దొడ్లో కూరగాయ చెట్ల గుబుర్ల లోనో
పచ్చ గడ్డితో నేసిన బంగారు తివాసీ మీనో ..
పగలల్లా నా కండ్ల ముందు పచార్లు చేస్తూంటుంది
నా విడిపోని నేస్తం, మా పెంపుడు పిల్లి.

ఎక్కడో దొరికిన చేప ఎముకలు రెండు
ఎగిరెగిరి కొరుక్కు తింటుంది
భయంతోనో, విజయ గర్వంతోనో పరికించి నా వేపు చూస్తూ
భూమి తల్లి ఒడిలో చేరి ముడుచుకు పడుకుంటుంది
తేనెటీగల పూసలతో కుట్టిన గుండ్రని బంతిలా

గుల్ మొహార్ చెట్టు మొదలు పంజాతో గీరతూ
భూ ప్రదిక్షణం చేసినంత ఆనందంతో దాని చుట్టూ తిరుగుతూ
సూర్యుణ్ణి ఓరగా చూస్తుంటుంది నీడలో నక్కుతూ

ఇప్పుడు యిక్కడే కనిపిస్తుంది మరుక్షణం మాయమవుతుంది
వరమిచ్చి పోయిన బ్రహ్మదేవుడిలా ఒక చలికాలపు సాయంత్రం
అస్తమించబోతున్న సూర్య బింబాన్ని
అదే పనిగా కొడుతూ కనిపించింది తనకాళ్ళ మెత్తని దిండ్లతో
అంతలోనే ముసురుకొచ్చిన చీకటిని
ఉండ ఉండలుగా నలిపి ఒంటికి పూసుకుంటూ
ఒక్కొక్క ఉండనే గోళ్ళతో లాగి భూమ్మీదికి విసురుతూ
లోకమంతా చీకటి కప్పేసింది

పగలల్లా నా కళ్ల ముందే పరుగెత్తుతుంటుంది
నా విడిపోని నేస్తం, ఒక గండు పిల్లి

## ఎనిమిదేండ్ల క్రితం...

పంచమి చంద్రుడు అస్తమించగానే
పరుగెత్తుకొచ్చింది చిక్కని చీకటి
ఆ ముందురోజు రాత్రి ..
తలవని తలంపుగా తాతగారికి
మృత్యువు మీద మమకారం పుట్టుకొచ్చింది
తీసుకెళ్లారు శ్మశానానికి
అంటూ నిర్ధార్చారు అక్కడ చేరిన వాళ్లు

భార్య ప్రక్కనేవుంది: కొడుకు కూచునే వున్నాడు
ఈ ప్రేమ బంధాలకు మించిన ఏదేవుడు
వెన్నెల్లో నుంచి పిలిచాడాయన్ను?
అసలాయన ఎలా మేలుకున్నాడు?
నిజంగా నిద్రపోయి లేచాడా?
శాశ్వత నిద్రా కాంక్ష శరీరాన్ని లాక్కుపోయిందా?
ప్లేగు వ్యాధి సోకిన ఎలుకలా కఠినంగా కనుమూయడం
ఇదేనా తను కాంక్షించిన గాఢ నిద్ర?
నోట్లో నెత్తురు కక్కుకుంటూ
మెడ మెలికలు తిరుగుతూ
మళ్లీ మెలకువరాని ఘాయదారి నిద్ర!

ఇదేనా తన కాంక్షించిన గాఢ నిద్ర?

పంచమి చంద్రుడు అస్తమించగానే
పరుగెత్తు కొచ్చింది నిశ్శబ్ద కాంత
ఒంటెలా పొడుగ్గా కిటికీ లోంచి తల దూర్చి
ఒంటరిగా వున్న తాతగారిని
వంగి చూస్తూ మెల్లిగా చెవిలో వూదింది,
"మళ్లీ లేవొద్దు నువ్వు
జీవితాన్ని తెలుసుకునే బాధ తీరిపోయింది
ఎల్లకాలం తెలుసుకునే వల్లమాలిన బాధ్యత వదిలి పోయింది.
మళ్లీ లేవొద్దు నువ్వు"
రాత్రంతా గుడ్లగూబ మేలుకునే వుంది
మరి కొంత కాలం బ్రతకాలని ఉవ్విళ్ళూరుతూనే వుంది
ముక్కుతూ మూలుగుతూ మంచానబడ్డ గోదురు కప్ప
తుది నిశ్వాసం వదలబోయి బావి లోంచి పైకి చూచి
ఇంకొక్క ఉష ఉదయం చూడాలని ఎంతో మోజుపడుతోంది!

కారు చీకటి క్రమ్మిన రాత్రి గర్భంలో
బ్రతుకును రక్షించాలన్న ప్రేమ భావంతో
కిటికీల, తలుపుల కాపలాదారుగా
తెర మీద ప్రతి అంగుళం పరిశీలిస్తూ
నిరాశతో దోమ గత్యంతరం లేక గర్జిస్తోంది

పుండు మీది నెత్తురూ, చీమూ పుష్కలంగా త్రాగేసి
తళతళల రెక్కలాడిస్తూ ఈగ
ఎండలో ఎగురుతోంది
అన్నింటిని ఆవరించిన జీవితేచ్ఛ
భవ బంధంతో కట్టేసి వాటిని బానిసలుగా చేసింది

ఆకుల మీద వాలిన గొల్లభామ పురుగు
పిలవాడి పట్టు విడిపించుకోడానికి
నానా యాతన పడుతోంది రెక్కలల్లార్చుకుంటూ

ఇంత మంది బ్రతకాలని యిన్ని యాతనలు పడుతుంటే
నువ్వేమో నిర్భయంగా, దిగుల్లేక వగల్లేక
పంచమి చంద్రుడు అస్తమించగానే
పడగెత్తుకు వెళ్ళావు మర్రి చెట్టు గట్టు దగ్గరికి
(ఇంత స్వల్పపు పెళుసు ప్రాణమా మనిషికి యిచ్చింది జీవితం!)

మర్రి చెట్టు కొమ్మ కదలి మృత్యువు మీద
అసమ్మతి ప్రదర్శనం చెయ్యలేదా?
బంగారు కాంతుల పువ్వుల మీద
మిణుగురు పురుగులు క్రమ్ముకోలేదా?
అక్కడే తొర్రల్లో దాగిన గుడ్డి గుడ్ల గూబ
"చంద్రుడుపోయాడు ఎలుకను పట్టుకోండి" అంటూ
ఎలుగెత్తి చాటలేదా?
ఈ మాత్రపు రహస్యపు సలహా నీ చెవిలో
ఆ గుడ్ల గూబ ఊదనే లేదా!

పైరగాలి పరిమళంలా ఘుమఘుమ లాడే
ఈ జీవిత సౌరభ్యాన్ని యింతగా నిరాకరించి
ఆత్మలోని ఆవేదన లన్నింటికీ అనంతమైన విముక్తి కలిగినట్టు
ఎందుకు నీవు మరణించావు, ఎలుకలా నెత్తురు కక్కుకుంటూ?

అయినా యీ మృత్యువు చెప్పే కథ
అసలు అంతం లేనిది
భగ్నమైన ప్రేమ ల్లేవు

జీవితం అంతా ఒక పొడుగాటి వస్త్రం
మధ్యలో ఎక్కడా అతుకు లేదు
కాలం మాత్రం పందెంలోలా పరుగెత్తుకుంటూ వచ్చింది
ఎక్కడ తేనె తెట్టె పట్టిందో అక్కడే వచ్చి వాలింది
దారిద్ర్య బాధకు లొంగని దేహం మీద వాలింది
ఆ యేనుగు బ్రతికినా పది వేలు
చచ్చినా పదివేలు

అందరికీ తెలిసిన కథేగా అది
ప్రేమకాదు, ప్రేయసి హృదయం కాదు
పసిపిల్ల వాడి పలికరింపు కాదు, కుటుంబ సౌఖ్యం కాదు
ఏదీ చాలదు మనిషికి!
సాధించిన అమోఘ ఘన విజయాల సరిహద్దుల కవతల
అన్నింటినీ మించిన దుఃఖమేదో అంతరాంతరాలో
రక్తంలోంచి ఉబుకుతుంది, అసంతృప్తి ఆవిర్భవిస్తుంది
గాలికి తూలిపడి పోయే బోలు మనుషుల మైపోతాం
శవాన్ని కట్టిన బొంగులూ, తాళ్ళూ
చివరి నిశ్వాసం విడుస్తాయి
హాయిగా ఆనందంగా నువ్వు పడుకుని వుంటావు
చింతా, చీకూ లేకుండా

ప్రతి రాత్రి గర్భం లోంచి గుడ్ల గూబ కూస్తూనే వుంటుంది
మర్రి చెట్టు తొర్ర లోంచి మనుషుల్ని ఉద్దేశించి
"చంద్రుడు పోయాడా ఎలుకల్ని పట్టుకోండి" అంటూ
మృత్యువుకు కనుసైగచేస్తూ, మూగధ్వనులు వినిపిస్తూ

తాతగారూ, తాతా, తాతయ్యా...
నేనూ నీ లాగే ముసలివాణ్ణి అవుతాను కదూ

గృహకక్ష్యలో నుంచి చంద్రుణ్ణి తొలగించి వేసి
రాత్రి వచ్చి ముసురుకోగానే
మన యిద్దరం చేదోడు వాదోడుగా
జగతి లోని సౌభాగ్యాన్ని మృత్యువుతో ముడిపెట్టుకుందాం.

## గాలి వీచిన రాత్రి

మినుకు మినుకు మంటున్న దీపాల్లా నక్షత్రాలు మెరుస్తుంటే
రాత్రంతా గాలి జోరుగా వీచింది
నా తల మీద ఎగిరే తెర చుట్టూ
గాలి గలగలా నాట్య మాడింది

కాన్వేపు దావిని ఉబ్బిస్తుంది ఉప్పెనలో పొంగిన సముద్రంలా
కాన్వేపు ప్రక్క మీది నుంచి ప్రక్కకు నెట్టేస్తుంది
నక్షత్రాల వైపు విసిరేస్తుంది
మెలకువ వచ్చి నా నిద్ర మత్తు కళ్ళకు
దోమతెర దూరంగా తొలగిపోయిన ట్లుంటుంది
నీలాకాశ లోకంలో తెల్లగా ఎగిరే రబ్బరు బెలూన్‌లా
నక్షత్ర లోకాల వైపు నాలుకలు చాస్తున్న ట్లుంటుంది.

మరణించిన చుక్కలన్నిటికీ మళ్ళీ తెలి వొచ్చింది గతరాత్రి
కోట్లాది నక్షత్రాలు పట్టే చోటే లేదు ఆకాశంలో
చనిపోయిన స్నేహితుల ముఖాలన్నీ స్వచ్ఛంగా కనిపిస్తున్నా యక్కడ
మర్రి చెట్టు కొమ్మల్లో చిక్కుకుపోయిన
ప్రేమ గాలిపటం కళ్ళల్లా

చీకట్లో నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి
ఆకాశం మెరుస్తోంది, ఏదో పాత కాలపు రాణీ గారు
పులి మచ్చల శాలువా కప్పుకున్నట్లుంది
అంత పరమానందంగా వుంది గడచిన రాత్రి

అనేక వేల యేండ్ల క్రితం అసువులు బాసిన నక్షత్రాలు
రాత్రి వచ్చి కిటికీ లోంచి రహస్యంగా తొంగిచూశాయి
ప్రతి దాని చర్మం మీద అతుక్కునే వున్నాయి
మృతి చెందిన ఆకాశపు ముక్కలు

అస్సీరియా, ఈజిప్టు, విదిశాది సమస్త దేశాల్లో
నశించిన అందాల రాణుల వంటి
కన్యకా మణులు కనిపిస్తున్నా రక్కడ
చూపుల తూపు ల్లాంటి చేతిలో బల్లాలు త్రిప్పుతూ
మంచులో మునిగిన వినువీధి చివరి అంచుల్లో
నుంచున్నారు వరుసల్లో మృత్యువును జయించడానికా ?
బ్రతుకు పొందిన విజయాన్ని హర్షిస్తూ ప్రదర్శనమా అది ?
ప్రేమకు భయంకరమైన స్మృతి చిహ్నాలుగా నిలిచారా ?

నే నున్నాను నీలాకాశం క్రింద
చినిగి ముక్కలు ముక్కలై
నలిగి పోయిన నల్లని బ్రతుకుగా
మనసంతా వికీర్ణమైన ఆందోళనల మధ్యగా

అనంతంగా చూచిన ఆ ఆకాశపు రెక్కల గాలికి
ఎగురుతున్న ఈగలా భూదేవి ఎక్కడికో దూసుకు పోయింది
ఆకాశ గర్భం లోంచి బైలుదేరిన యీదర గాలులు
వాకిటి లోకి పరుగెత్తుకు వచ్చాయి

మృగరాజు గర్జారావం చెవుల్లో గింగురుమంటూ మ్రోగి
స్టెప్పీ ఎడారిలో పరుగెత్తుతున్న జీబ్రాల గుంపుల్లా
సురసురలాడే సూర్య కిరణాలు పరచుకున్న
బీళ్ళల్లో పెరిగే పచ్చగడ్డి పరిమళాలు
గుండెలో గుప్పించి కొడుతున్నాయి

విశాలమైన నిశా కేశాల సౌరభావేశంలో చీకటి రాత్రి
నా గుండెలో గుడి కట్టుకుంది
ఎద్దైన ఆడ సింహం అరుస్తూ పరుగెత్తుతున్నట్లు
నా గుండెలో గుచ్చుకుంటున్నది రాత్రి
నీలంగా, చిరిగి పోయిన చేలంగా

ఇహ సంబంధమైన సర్వోహాలను హఠాత్తుగా త్రెంచుకొని
నా గుండె ఊదిన రబ్బరు బెలూన్‌లా
నింగి లోకి ఎగిరి పోయింది
అనంతాకాశ వీధి మీదికి విసిరిన నక్షత్రాల తెరచాపలా
నీటిలో మిలమిల మెరుస్తూ ఆనందంగా ఆడే చేపలా.

## అడవి హంసలు

నల్లని గడ్డ గూబ రెక్కలు నక్షత్రాల వైపు విప్పుకున్నాయి
వెన్నెల పూత వేసిన బురద భూములమీద
అడవి హంసలు ఎగిరి పోతున్నాయి
చెవులు చిల్లులు పడుతున్నాయి
అల్లార్చే రెక్కల చప్పుళ్ళకు హోరున గాలి వీస్తున్నట్లు

చీకటి రాత్రి అంచుల మీద ఎగిరే రెక్కల చప్పుడు
యంత్రాలు పని చేస్తున్నట్లు ఘోష పెడుతున్నాయి
ఎగురుతూ ఎగురుతూ ఎంతకూ తెగని చీకటి లోకి
కోట్లాది నక్షత్రాల కొస లోకాల్లోకి చేరుకునే
హంసలు తమ దేహ సౌందర్యాన్ని ఆకాశానికి అప్పిస్తున్నాయి

హఠాత్తుగా కంటికి కనిపిస్తుంది
అందాల రాసి అరుణిమ సన్యాల్
చెరిగి పోయిన గ్రామ జీవితపు గత స్మృతులను నెమరు వేసుకుంటూ

ఎగరాలి ఎగరాలి యీ హంసలు యింకా యింకా ఎత్తు ల్లోకి
వెన్నెల పరిచిన వెండి తీగల మార్గాల వెంట
ఎగరాలి ఎగరాలి యీ హంసలన్నీ
భూలోకపు రణ గుణ ధ్వనులు సాంతం సమసి పోయి
నా గుండెలో పరిచిన వెన్నెల పిశ్శబ్దపు వెన్న ముద్దల వీధు ల్లోకి
ఎగరాలి ఎగరాలి యీ హంసలన్నీ

## మిణుగురుల్లా ఎగిరే యుగాలు

అనంత కాలపు చీకటి గర్భంలో
ఆడుతుంటాయి యుగాలు, బ్రహ్మకల్పాలు
మిలమిల మెరిసే మిణుగురుల్లా

సముద్రపు యిసుక తిన్నెల మీద వెన్నెల పరుచుకుంటుంది

ఎత్తైన దేవదారు వృక్షాలు
నిటారుగా నిలిచి చూస్తుంటాయి
నిశ్శబ్దంలోకి
పోయిన రాజ్యాలలో
కూలి పోయిన జయ స్తంభాలులా
మృతి చెంది ఘనీభవించిన
నీరవ నిశ్శబ్దం లోకి

జగతిలో జీవ శబ్దాలు
పలచబడి మౌనం వహించాయి
మృత్యు నిద్ర వంటి కోరా గుడ్డలతో
మన దేహాలు కప్పేశారు
గాలిలో శవాల కంపు కదిలాడుతున్న ట్లుంది
అంతలో ఎండుటాకులు గలగల లాడిన శబ్దం ....
"గుర్తించారా నన్ను ?"
"వనలతా సేనువా ?" అన్నాను నేను.

## చలి కాలపు రాత్రి పూట

అటువంటి చలి కాలపు రాత్రిళ్లు వచ్చి
గుండెల మీద కూచుంటుంది మృత్యువు
రాలి పడిన ఆకుల మీద
కరిగిపోయిన మంచుబొట్ల మీద
పాట అల్లి పాడుతుంది తొర్రలో గుడ్ల గూబ

ఊరు దాటిన అడవి మార్గంలో
గర్జిస్తుంది సింహం
సర్కస్‌లో దెబ్బలు తిన్న పులి
గొంతెత్తి గాండ్రిస్తుంది

ఆ రాత్రి గర్భం చీల్చి వెలుగులు విరజిమ్ముతుంది
అంతలోనే హఠాత్తుగా కూస్తుంది కోయిల
వసంతాగమన సూచీ వాద్య సంగీతంలా

ముసలి తనంతో ముడుచుకు పోయిన
కోట్లాది కోయిలలు నేం చూశాను
వణుకుతున్న వృద్ధ పక్షిలా నలుదిక్కులు చూశాను.

మళ్లీ సింహం గర్జిస్తుంది
సర్కస్‌లో దెబ్బతిన్న పులి
గొంతెత్తి గాండ్రిస్తుంది
కాలం అనంతత్వంలో కలిసిపోతుంది
అంధత్వంలోకి జారిపోతుంది
అంధకారంలో మునిగిపోతుంది

చచ్చిన చేప తోక పట్టుకుని సాగిపోతూ నీళ్ళల్లో
జీవితావశేషాలు మిగిలున్నాయేమో
చుట్టూ వున్న సముద్రంలో చూసుకోవాలి

అంతు చిక్కని యీ జలధి అంచుల మీద
కన్నుపొడుచుకున్నా కనిపించకుండా
పొగమంచు పేరుకు పోయింది
అంతా కనిపించకుండా పోయింది.

## ఈ నా చెవుల్లోకి

ఆకాశం లోని నక్షత్రాలను అదే పనిగా చూస్తూ
లోకం లోని దుఃఖాన్ని గుండెల్లో అదుముకుంటూ
ఆషాఢ మేఘాల్లా
యువకులు కవితలు కురిసి
చెప్పకుండా వెళ్ళిపోయారు

తెలిసీ తెలియని తనంతో
భయంతోనో భక్తితోనో
అవలోకగా, ఆశ్చర్యంగా
చెవులొగ్గి వింటున్నప్పుడు
జగతి లోని సౌందర్య శిఖరాల మౌన భాషలు
వారికి పూర్తిగా వినిపించలేదు

అయినా, ఇత్తడిని మేలిమి బంగారంగా మార్చి
ఊహా ప్రతిబింబాలు మనః ఫలకాల మీద ముద్రించి
చలనం లేక చెవుడొచ్చిన
ఈ జగతి చెవుల్లోకి
కోట్లాది శాశ్వతమైన మాటల మూటలు దించి
యువకులు కవితలు గానం చేసి
చెప్పకుండా వెళ్ళిపోయారు.

# వాన కురిసిన రాత్రి

సల్లగా పరుచుకున్న చీకటి సందుల్లోంచి
జోరుగా కురుస్తోంది అరు బైట వర్షం
మెల్లగా మెలకువ వచ్చింది
వందల మైళ్ళ దూరాన హోరెత్తి గోల పెడుతున్న
సముద్ర తరంగాల సవ్వడికి

భూదేవి అంచుల్ని బాహువుల్లో బంధించి
సముద్రం చేసే సందడి వేపు చెవులు రిక్కించి వింటూ
సీలాకాశం నిశ్శబ్దంలో నిశ్చలంగా నుంటుంది

ఆకాశపు దూర దేశాల అంచుల వద్ద
వెలుగులు విశాలంగా పరుచుకున్న చోట

పెద్ద పెద్ద గేట్లు తెరచి మళ్ళీ
మూసుకుంటున్న ధ్వనులు వినిపించాయి

దిండ్ల మీద తలలు పెట్టి తెల్లవారి లేద్దామన్న ధీమా తోనే
అందరూ నిద్రిస్తుంటారు గాని
మృదువైన గుండె కొండలో లోతుగా కూరుకు పోయిన
చిరు నవ్వులూ, ప్రేమలూ మెల్లిగా కదుల్తూ
పైకి ఉబుకుతూ పలుకరిస్తూంటాయి.
నిశ్చలమైన భూగర్భం లోంచి నన్ను లాగేసి
బైట చీకట్లో పడేస్తాయి

సముద్ర ఘోష హఠాత్తుగా సద్దు మణిగి
నేల మీద నిశ్శబ్దం పరుచుకుంటుంది

ఎవరో వెనకగా నా భుజం మీద చేయ్యేసి లేపుతారు
ఏవేవో గుసగుసలు వినిపిస్తారు
ఆకాశంలో తెరుచుకుంటూ మూసుకుంటున్న
ఆ తలుపుల్ని అందుకో గలవా ?
ఇటువంటి చీకటి రాత్రిలో అది సాధ్యమే ?

కండ్లు తెరుస్తాను
నల్లటి మేఘంలో ప్రాకుకుంటూ వెళ్ళి
చీకటి ద్వారాల్లో ప్రవేశిస్తాను
అంధకార మహా గుహాంతరాళాలు
అప్పుడు నన్ను మింగేస్తాయి.

## కల

మట్టి ప్రమిదె లోని దీపపు కాంతిలో
దిగుల్తో చూస్తుంది నా వేపు
ఇంకా పూర్తి కాని వ్రాతప్రతి

ఆకుల రాలుస్తున్న మంచు బిందువుల సవ్వడి వింటూ
నేను నిశ్శబ్ద సింహాసనమీద నిలువుగా కూచుని వున్నాను.
కిటికీ వెలుపల వేప చెట్టు మీద నుంచి
ఒక పక్షి రివ్వున ఎగిరి

ఆకాశపు మంచు లోకి అదృశ్యమై పోయింది
దాని రెక్కల గాలిగా నా దీపం కొండెక్కుతోంది!
ఈ చిమ్మ చీకట్లో
అగ్గిపెట్టె ఎక్కడుందో?
ఒక్కక్షణం ఆగుతాను
తీరా దీపం ముట్టిస్తే ఎవరి మొఖం చూడవలసి వస్తుందో?

బహుశా ఆ ఉసిరిక చెట్టు కొమ్మల వెనుక
పూర్ణ చంద్రుని వంటి ముఖ మేదో
జింక కొమ్ములా మెలికలు తిరుగుతూ
మబ్బులో మెరుపులా తళుక్కు మంటుందేమో!

అదే నా పాత కాలపు తాళపత్ర గ్రంథం
మృదువుగా చేతుల్తో తాకి ముద్దు పెట్టుకున్న బంధం
లోకం దాన్ని ఏ నాడో మరచిపోయింది!
జగతి లోని దీపాలన్నీ పూర్తిగా ఆరి పోయాక

మనుషు లందరూ మాయమై పోయాక
కమ్మని కలలే మిగుల్తాయి
ఆ సంపూర్ణ చంద్ర ముఖమూ నేనూ
ఆ కలల శయ్య మీదే కాలం పుచ్చుతాము.

## గాలి పటం

పతంగి, పతంగి
ఓ బంగారు రెక్కల పతంగి
ఈ మేఘావృత గగనంలో
ఎందుకు పల్టీలు కొడతావు ?
నది ఒడ్డు యిసుక తిన్నెల మీద
ఎందుకు చక్రాలు చుడతావు ?

సింగిలో నువ్వు చేసే సందడి చూస్తే నా కామె
కండ్లు గుర్తొస్తున్నాయి
ప్రేమ మొక్కల పండ్లలా పాలిపోతున్న కండ్లు
చిన్నపిల్లల కథల్లో రాజ కుమారిలా
అంద మంతా వెనకాల వదిలేసి
ముందుగా వెళ్ళిపోయింది

ఆమె నెందుకు మళ్ళీ మళ్ళీ లాక్కొచ్చే ప్రయత్నం ?
గుండెలో దాక్కున్న గాయాల్ని
మండించి కెలుకుతా వెందుకు ?
పతంగి పతంగి
నా బంగారు రెక్కల పతంగి ! !

## నవ హంసలు

నీళ్లల్లో తొమ్మిది హంసలు
ఆకాశంలో తెలి మబ్బుల్లా
ప్రతి ఉదయం పచార్లు చేస్తాయి
మృదువైన తామర మొగ్గల్లా

మూడూ మూడూ గుణిస్తే తొమ్మిది
ఇది గణితం
ఈ హంసలు తొమ్మిదే ఎందుకైనాయో!
అది అగణితం

ఈ నది లోతు అనంతం
తెల్లని ఒక మబ్బు తునక దాన్లో మునిగిపోయి
మునిగి మునిగి లోతుకుపోయి
పోయి పోయి అంతులు వెదికి
కాలాంతాన్ని కనుక్కోలేదు
ఆవలి కొసలు అందుకోలేదు!

పరిసరాల్లో పచ్చని గడ్డి తివాసీలు పరుస్తున్నది
అయినా ఆ చలికాలపు నది నీరే నీలాకాశంగా మారింది

ఆడుకుంటున్న పిల్లలు అమ్మ ఒడి లోకి చేరినట్లు
సాయంత్రపు నలివెచ్చని వెలుగుల్లో
హంసల గుంపు కలిసిపోయింది

నదీ మళ్ళీ నా వేపు చూసి నవ్వీన ట్లుంటుంది
నా ఆలోచనల ముంగిటి లోంచి
జ్ఞాపకాల గృహం లోకి
మళ్ళీ హంసలు ప్రవేశిస్తాయి.

## సూర్యునితో పోలిక

పెళ్ళ పెళార్భటులతో చెలరేగిన ప్రతిష్టంభన ముగిసి
జీవితం తల మీద ఒక మహా విపత్తు ఫెడేలుమని కొడుతుంది
కాని దానికి చలించం మనం
అది తెలుసుకో వలసిన ఒక చిన్న అంశంగా మారి పోతుంది
అంతే జీవితంలో దాని హోదా

ఇసుక రస్తాల మీద పరుగెత్తుతుంది నదిలో నీరు
అప్పుడప్పుడు సూర్య కిరణాలు మృదువుగా స్పృశిస్తుంటాయి
పరుగెత్తుతూ రెక్కల పక్షి తన నీడ చూసుకుంటుంది
ఎదురుగా తలపడి పోరాడుతున్న రెండు కత్తుల్లా
మరణమూ జాలీ పని చేస్తాయి మహీతలం మీద
ఒకటి ధ్వంసం చేస్తే రెండోది నిర్మిస్తుంది
పట్టణమో, వంతెనో, గుడి గోపురమో, గుండె తలుపులో
ఏదైతేనేం చస్తుంటుంది, పుడుతుంటుంది
సాక్షీ భూతంగా ఆకాశం చాపలా పరుచుకుని చూస్తుంటుంది
సూర్యుడూ గాలీ ఎంతో కాలంగా

కని పెడుతూనేవున్నారు కాలాన్ని
దానిని చూసిన వాళ్ళందరూ, దానిని ప్రేమించిన వాళ్ళే
కాలం తెచ్చి వాళ్ళందర్నీ సంతలో అమ్మేసింది
అదృశ్యమై పోయారు అందరూ

అయితే రా మరి నువ్వు. అంతర్ముఖులమై పోదాం
మన క్రొత్త లోకం లోని అనుభూతి కషపార ప్రావి
సంపూర్ణసత్యంలో భాగమై వెలిగిపోదాం

కాలం ఒక కొత్త ఉషస్సు వైపు
చరచరా నడిచి పోతోంది—
జగతిలో ఏ మూలనో ఏమో
పక్షి కూత వినిపిస్తున్నది
ఇంకా మనం చూడదలచిన సూర్యోదయం కానే లేదు
మృత్యువు మీదికి దూసుకు పోతున్న మనం
మృత్యువునే కాదు
ఆ మృత్యు మహా సముద్రం మీద జరిగే
నృత్యాలు సర్వం చూశాము
విస్మరించాం కొన్ని
మనస్సులో మెదలాడు తున్నాయి మరి కొన్ని

కాని ఈ భూమ్మీది దుమ్మూ ధూళీ
దేహం నుంచి దులుపు కున్నాక కూడా
వేశ్యకు విడాకులు యిచ్చేశాం
ప్రియురాలిని మోసగించాం
ఏమి గుండె యీ కఠినపు గుండె ?

ధనానికి దాసు డవుతాడు ఒకానొక విప్లవ కారుడు
భగ్నప్రేమికుడు జీవితాంతం చచ్చిన వాడిలా బ్రతుకుతూ
ఒంటె వీపు మీద మోసుకు పోతున్న
సరుకుల మూటలు చూసి సంతోషిస్తుంటాడు
ఆలోచనల కందని దూరంలో
ఎక్కడుంది బ్రతుక్కూ సత్యంతో లంకె?

నిశ్శబ్ద స్తంభం మీద నుంచోని మనం చూస్తున్నాం
సముద్రం మీద పరుచుకున్న
అంతు లేని యోజనాల అనంత దూరం లోకి
పక్షులు గూళ్ళ వేపు పరుగెత్తుతాయి
వెన్నెల వచ్చే లోగా ...
మనమూ అంతే, పరుగెత్తుతుంటాం
చంద్ర దర్శనం మాట మరిచి పోయి
వెలుగు వచ్చే లోపలే
అనంత కాలం లోకి అడుగేసి ప్రవేశిస్తాం

వెనుక ఉన్న తరంగాలు మనల్ని మోసగించి పంపేశాయి
ముందున్నది అనంత కాల నిశ్శబ్ద మహా సముద్రం
ఉప్పు నీటి రెక్కలు ఊపుతూ భయంకరంగా-
దేశద్రోహుల్లా కొన్ని అలలు జలధి గర్భం లోకి జారుతున్నాయి
మృత్యువు కూడా అనంతమే
జీవితం మీద దానికి ఎల్లకాలం పంతమే

మనిషిని మృత్యువు నుండి కాపాడడానికి
మనందరం మరణిస్తున్నాం
గుండెల్లోకి వేళ్ళు తన్ని కూచుని వుంది మృత్యువు

చరిత్ర ముందు పరచుకున్న అనంత విశ్వాసాన్ని అవతలికి తోసేసి
మనిషి ఆత్మ పొంగిన అంచుల ఆవధుల వెనుక
మళ్ళీ లేస్తాయి ఈ అలలు
అంతులేని నల్లని వెలుగుల్లోకి
సంవత్సరసంఖ్య 43, 44 పేర్లతో
అనంత కాలంలోకి

## విశ్వవిద్యాలయ ఆచార్యుడు

దొండ పండు లాంటి పెదవుల మీద
చిలకలా చిరునవ్వు చిందుతూ
అడిగాను ఆ ప్రొఫెసర్ గార్ని
కండ్లద్దాల సందుల్లోంచి ;

"ఎక్కడున్నది మీ చేతం?
మీరే సొంతంగా ఎందుకు రాయరు ఆ కావ్య గీతం?"
ఆ మనిషి నీడ మాట్లాడలేదు
ఆ ప్రశ్నకు జవాబు లేదు.

ఆశ్చర్య మెందుకు, అతనేం కవికాదు
మరి యెవరంటే-
చిత్తు ప్రతులూ, సిరా బుడ్డీ
ముఖ్యాంశాలూ ముడి పదార్థాల
బంగారు పూత పూసిన బహుంకాల సింహాసనం మీద కూర్చున్న

ఆయన కేవలం గ్రంథానికి ఉపోద్ఘాతం,
కావ్యానికి అవతారిక !

ఆయనేం కవికాదు; పండ్లూడిన పండితుడు
అమరత్వాన్ని రాసుకుంటున్నాడు
నెలకు రెండు వేలు జేబులో వేసుకుంటున్నాడు
పదిహేను వందల నుంచి బ్రతికి చచ్చిన కవుల
ఎముకలు గుల్లగుల్లగా ఏరుతున్నాడు
తమ సౌఖ్యాలను గాలికి వదిలేసి
కాయాన్ని ముక్కలుగా కోసి ఆలోచనకు అర్పణచేసి
జీవితాగ్ని హోమం నుండి చిరువేడి గాలులు కూడా తగలక
ఎముకలు కొరికే చలిలో
ఆకలితో ఆవేదనతో అలమటించి అలమటించి
సంసార సముద్రంలో దుఃఖాల తిమింగిలాలతో యీదుతూ
ఒకనాడు బ్రతికి - చచ్చిన కవుల
ఎముకలు ఏరుతున్నాడు.

## ముగ్గురు ముష్టివాండ్లు

పగటి కాంతి పగిలిపోతున్న సాయం సంధ్యలో
రోడ్డుప్రక్క మట్టి విగ్రహాల్లా ముగ్గురు ముష్టివాళ్లు
ఆవరించబోతున్న నిశ్శబ్దంలో
ఆవలింతలతో కలిసిపోతున్నారు
పగటి వేళ సందడి లోంఛి

ప్రశాంతతలోకి పరుగిడుతున్నారు ..
కడుపార నోటితో గాలి ముద్దలు భుజించి
గంభీరమైన గాలితో మళ్ళీ కడుక్కుంటున్నారు నోళ్ళు!
ఇప్పుడు వారి గమ్యం ఏటి తీరపు యిసుక తిన్నెలు
చాకలివాడూ గాడిదా కథల్లో
ఒకరి నొకరు మోసుకుంటూ
వంతెన కింద పారే నీటిలో
ప్రతిబింబాల్లో కలిసిపోతారే . .
ఆ ఏటితీరపు యిసుక తిన్నెలు యిప్పుడు వారి గమ్యం

ముగ్గురూ విడిపో యే ముందు
ముచ్చట్లు మాట్లాడుకుంటారు
కుమిలి పోయే గుండెల్లో టీ కప్పుల ముందు
గుంభనంగా కూచుంటారు తమ జీవితంలా

అందులో ఒకడు జీవితానికి రాజరాజు
మరొక్కడు మహామంత్రి
సమస్యల రణ రంగ వ్యూహాలు పన్నే సర్వసైన్యాధిపతి మూడోవాడు

ముగ్గురు కుంటి మామల మీద మోజుతోనో
చాయ్ కప్పుల ఘుమఘుమల మీద ప్రీతితోనో
వచ్చి కూచుంటుం దక్కడ ఒక బిచ్చగత్తె కూడా
నలుగురూ కలిసి ఒక క్షణం పాటు
నరకలోక మహానందంలో నాట్యం చేస్తారు.
గిన్నెలో నీళ్ళు తీసి కొన్ని టీపో కలుపుతారు
జీవితాన్ని జాలి గుండె కలదానిగా చిత్రించాలని కాదోయ్
ప్రక్కవాళ్ళే ఆదరించే పద్ధతికి ప్రాణం పోయాలని కాదోయ్

అందులో ఒక దంటాడు అసమ్మతిగా తల త్రిప్పుతూ
"ఏం బతుకుతాం యీ వేడి నీళ్లతో!
తండ్రి అంతే తనయుడంతే, తల్లీ అంతే పిల్లా అంతే
ఒక్కరైనా చిల్లి గవ్వ బిచ్చగాడికి పడెయ్యరు
ఏం బతుకుతాం యీ వేడి నీళ్ళతో"

దువ్వడం ఎరగని జుట్టు జూలులా విదిలించి వేస్తూ
జీవితం మీద తేలిటి తీర్పు ప్రకటించి
ప్రక్కనే వున్న బిచ్చగత్తెను పరిశీలనగా చూసి
ఈ ఆడదయ్యం ఎక్కడిదని భయభ్రాంత మనస్కులై
టీ కప్పులో రేగిన ఆవిరిలో ఉద్భవించిన భూతంగా చూసి
పాపం! ఒకనాడు హంసలా అందంగా ఉండేదేమో
ఇప్పుడు చూడు కుంటి బాతులా కూచున్నదనుకున్నారు

ఆమె దగ్గిరా ఒక కప్పు వుంది, అయినా తమ కప్పుతో యిచ్చారు
అందరూ ఆనందంగా త్రాగారు, వేడి వేడి మంచి నీళ్ళ టీ
"డబ్బు లేకుంటే ఏమోయ్—మనం ఒకరి కింద తొత్తులం కాదు"

ఈ మెట్ట వేదాంతం వింటున్న ఒక దోమకు
కొండంత కోపం వచ్చి
ఒకరి ముక్కు మీద నుండి మరొకరి చెవి మీదికి
ఎగిరి గంతేసింది

రొంటిక్ పీధి నది ఒడ్డున కూచుని
తమకు లేని లోక సుఖాలను పుట్టిపాళ్ళు
వ్రేళ్ళ మీద లెక్కించు కుంటున్నారు
అందరూ తీవ్రంగా ఆలోచించి
తమకు తెలియని తర్కంతో పడ్డారు

ఖర్చు ఎందుకు చెయ్యాలి, దేని మీద చెయ్యాలి?
ఎవరికి డబ్బు యివ్వాలి, ఎందు కివ్వాలి?
ప్రాణాన్ని నిలబెట్టే మందు
చచ్చానిక గొంతులోపోస్తే
ఏ మవుతుందని అందరూ ఊహా గానాలు చేశారు!

ఎందుకు యీ చర్చంతా అంటే
ఇకమీద వీరు ఏటి ఒడ్డుకు వెళ్ళాలి
అక్కడ ఎముక ముక్క తింటున్న కోతి
నీటిలో ప్రతిఫలిస్తుంటుంది
కాలం అనేది వున్నంత కాలం
కనిపిస్తూనే వుంటుంది ప్రతిబింబం.

## వెళ్ళొద్దు సురంజనా!

వెళ్ళొద్దు సురంజనా! అక్కడికి వెళ్ళొద్దు నువ్వు
అక్కడ ఎవర్నీ పలకరించొద్దు నువ్వు
వెళ్ళొద్దు సురంజనా అక్కడికి వెళ్ళొద్దు నువ్వు

ఈ పొలాల్లోకి రాకాదూ, సముద్ర తరంగాల్లో కలిసి
నా గుండెలోకి ఎగిరి పడరాదూ!
అక్కడి మనుషుల్తో కలసి, అమ్మో, అంత దూరంగా, దూరంగా
అనంత కాలగర్భం లోకి అలా వెళ్ళొద్దు సురంజనా!

ఏమిటి అక్కడ మాట్లాడేది అంత మహా రహస్యం ?
ఆకాశానికి వెనకాల వుండే అనంతాకాశ మధ్యంలో
నువ్వు యీ భూదేవి లాంటి దానివి
అక్కడి ప్రేమ నేల మీద పెరిగే గడ్డి మైదానం
నీ గుండె యివ్వాళ సురంజనా !
నిజంగా పచ్చని గడ్డిలా వుంది

గాలి లేని శూన్యంగుండా గాలి వీస్తోంది
ఆకాశం అంగలు వేస్తోంది అనంతాకాశ శూన్యం లోకి.

## సరోజినీదేవి సమాధి

ఇదుగో యిక్కడ నిద్రిస్తోంది మన సరోజినీ దేవి
(ఇంకా యిక్కడే వుందేమో నాకు మాత్రం తెలియదు)
ఇక్కడే శాశ్వతంగా వుండేట్లు
సంగీతాన్ని దాచిపెట్టారు !
తరువాత తనంత తానే ఎగిరి మబ్బుల్లో కలిసిందేమో !
చీకటి లోకం చివరలో
మొలిచిన వెలుగుల ముఖ ద్వారంలో

అందాక వెళ్ళుంటుందా, సరోజినీ దేవి
నిచ్చెన మెట్ల మీద కాకుండా
గాలిలో తేలే రెక్కలు లేకుండా ?

భూమ్యాకాశాల రేఖా గణిత శాస్త్రంలో
సరోజిని ఒక చిన్న గీతా?
అక్షరమైన కావ్యలోకాల అధినేతా?

గాలిలో వ్రేలాడుతున్న ఆ భూతాన్ని గట్టిగా అడుగు—
ఏమో నాకు తెలిసేదంటుంది!
ఆకాశంలో కాషాయ వర్ణ కిరణ శకలం ఒకటి
పరివేషంతో మిలమిలా మెరుస్తోంది
నీహారం కప్పిన నిప్పు కన్నెలా
బూడిదలో దాక్కొని కనిపించని పిల్లిలా
ముఖం మీద చిరునవ్వుల జిత్తులతో మోసగిస్తూ
కనిపించీ, కనిపించని ముఖం మీద చిరునవ్వు చిందులతో
చూపరుల కనువిందులతో.

## వసంతం ముగిసింది

మసక మసక చీకట్లు ముసురుకుంటున్న వేళ
కొండ ప్రక్క అడవి లోకి కోలాహలంగా
పాత కాలపు గుంట నక్కలు ప్రవేశిస్తాయి
వెంటబడి కనిపించిన దాన్నల్లా వేటాడుదామని
మీద పడి కరుస్తూ, మిక్కుటంగా అరుస్తూ
అడవిలో చీకట్లో అటూ యిటూ తిలకిస్తాయి

ఆ చీకట్లో ఏముంది ఆహారంగా తినడానికి?
నిశ్శబ్దంలో ఏముంది తీవిగా నుంచుని వినడానికి?

వెన్నెలలో మంచు కన్నెలు వెల్లకిలా పడుకుని వుంటారు
నిమ్నోన్నతాలు పట్టించుకోకుండా నిద్రిస్తుంటారు

అటువంటి మధుర క్షణాల్లో యీ చతుష్పాద జంతువులు
నా లాంటి మానవతా మూర్తిలా
గుండె లోని సంగీతాలు గొంతెత్తి పాడగలవా?

ఆశ్చర్యమో, బాధో అంతు తెలియని దశలో
అవి దిగాలు పడి చూస్తుంటాయి అటూ యిటూ—
నా కండ్లముందు నవ్వు తళుక్కున మెరిసినప్పుడు
రక్త నాళాల తలుపులు ఛేధించుకుని
నా గుండె బైటికి వచ్చి నృత్యం చేస్తుంది

అంతటితో వసంత కాలం
అంత మవుతుంది!

## బాటసారి

ఏ దూర పారావార గర్భం లోని పరిశుభ్ర జలం లోనో
సృష్ట్యాది జీవరాశి మొలకెత్తింది
అంతకు ముందు బ్రతుకూ లేక చావూ లేక
ఆకృతి లేక చైతన్యం లేక అంతటా పరుచుకున్న మంచు
రానున్న జీవరాశి కావ్యానికి
అదే ప్రథమాక్షరపు గుర్తు
అదే సంకేతం జీవానికి

జీవం పుట్టింది, చైతన్యం పుట్టింది
వెలుగు చూసింది, ఆకాశమూ నీరూ అన్నింటి బరువు మోసింది
అక్షరానికి ఒక కొత్త అర్థం వచ్చింది
అది నేల అనే ఉయ్యాల లోకి ప్రాకి వచ్చింది
చైతన్యం శిశువైంది, చైతన్యం మనిషైంది
జనన మరణాల, కష్ట సుఖాల కావడి కుండలు భుజాన మోస్తూ
మానవుడు భూమ్మీదికి వచ్చాడు

నేనే దిగాను యీ భూమ్మీదికి
నలటి పొగ ధూళి గుండా నడుచుకుంటూ
ఎర్రటి నెత్తురు చారల గుండా చేతి కర్ర పొడుచుకుంటూ
అంతు లేని కోర్కెల రస్తాల మీద అడుగులు వేసుకుంటూ

చెప్పలేనన్ని దిగుళ్లు తల మీద త్రవ్వి పోసుకుంటూ
నేనే దిగాను యీ భూమ్మీదికి
దుమ్మూ, ధూళీ నిండిన వాతావరణ వీధుల్లోంచి
ఇదుగో నే నొచ్చానని వెక్కి వెక్కి గొంతెత్తి చెప్పాను

ఎవరికి? ఎందుకు?
ఈ భూమిలో వుండే మనిషికి?
ఆకాశంలో మండే సూర్యుడికి?
దూళిలో ఒక రేణువుకూ, అణువుకూ పరమాణువుకు?
నీడకూ, వానకూ, వానలో ఒక బిందువుకు?
నగరానికి, ఓడ రేవుకు, రాజుకు, రాజ్యానికి?
విజ్ఞానపు వెలుగుకూ, అజ్ఞానపు చీకటికి?
ఎవరికి? ఎందుకు?
అర్థం చెప్తారేమో నని, అన్నిటికీ, అందరికీ....

పుట్టినప్పటి దళసరిమంచే
మరణం మీద కప్పుకుంటుంది
నాకు చావు లేదని చెప్పుకుంటుంది

అయితే అదే యిప్పుడు తన చీకటి ముఖంతో వచ్చి
వెలుగు పాదాల మీద మోకరిల్లింది
ప్రేమతరంగాల మీద తేలాడుతూ మనిషి మనస్సు
ఆకాశపు లోకాల దాకా యీదుతూ పోతోంది
చీకటి సముద్రాల్లోకి చీల్చుకుంటూ పోతోంది

ప్రతి ఉదయం సూర్యుడు వచ్చి
దివ్వె వెలిగిస్తూనే వుంటాడు
చావు బ్రతుకుల పరమార్థ స్పృహ కలిగిస్తూనే వుంటాడు
అయినా అది దిగలేనంత లోతే
ఎక్కలేనంత ఎత్తే....

ఈ మానవ జీవిత మహాయాత్రలో
మనిషి వేసే ప్రతి అడుగులో
ప్రేమ ధ్వనిస్తుంటుంది
బాధ ప్రతి ధ్వనిస్తుంటుంది
జీవితం పెరుగుతుంటుంది, విరుగుతుంటుంది
నది లాగా మానవ హృదయం
నిరంతరం పారుతూనే వుంటుంది
చీకట్లు దాటి ఉదయ సముద్రాన్ని చేరుతూనే వుంటుంది

అనంత సూర్యోదయాలు ఆవిష్కరించుకునే కాల ప్రవాహంలో
ప్రతి రోజు క్రొత్తే సూర్యుడు
ప్రతి పక్షి కొత్తే కంటికి
కొత్త కొత్త పల్లెలూ, పట్నాలూ—

కొత్త కొత్త మార్గాల్లో కొత్త కొత్త బాటసారులు పయనిస్తారు
బాటసారుల హృదయాల్లో దాక్కున్న ఉదయాల్లో
కొత్త వెలుగులు కనిపిస్తుంటాయి
కొత్త పాటలు వినిపిస్తుంటాయి
ఈ నిరంతం మానవ జీవయాత్ర —
ఆది లేని మధ్య లేని అంతం లేని
ఇదంతా ఒక పెద్ద అనంతం!

## అనుపమ త్రివేది

జీవకళ చెదిరి పోతోంది, అలంకార హీన మయ్యాయి
అనుపమ త్రివేది ముఖ కవళికలు
హఠాత్తుగా ఆనాటి చలిరాత్రి వేళ

గుండ్రంగా తిరుగుతున్న భూమాత గర్భ గోళంలో
అత నిప్పుడు లేనట్లే ...
చలి వాహనం మీద విచ్చేసిన నిశ్శబ్దం
టేబిల్ ముందు నిల్చున్నప్పుడు
అతని మనసు గత స్మృతుల అఖాతం లోకి
అమాంతం దూకినప్పుడు....

పోయిన వారు, పోబోతున్న వారు
పోమని భీష్మించు కూర్చున్న వారు
ఎందరో స్మృతి పథంలో ఎదురుగా, చిందర వందరగా....

ప్లాటో నుండి టాగూరు దాకా
ఎందరో మహానుభావులు
తమ భావాల గంపలు భూమ్మీద కుమ్మరించి
తప్పుకుని పోయారు
మంచు దుప్పట్లు కప్పుకుని చలిలో శయనిస్తున్నారు శాశ్వతంగా

త్రివేది యిప్పుడే తన కౌమార్యాన్ని
ముక్కుతో ఊదేస్తున్నది
తాను వెళ్ళి అందరినీ లేపటాని క్కాబోలు!
బౌద్ధ ధర్మం, తంత్ర శాస్త్రం
హెగెలు తత్వం, మార్క్స్ భావాలు
చెవి పట్టుకుని అతన్ని పలు దిక్కులకు లాగుతోంటే ..
చూడగా చూడగా, తరిచి తరిచి చూడగా
అన్ని సిద్ధాంతాల యిటుకలతో కట్టిన మేడగా
జ్ఞానం కంటే ప్రేమే ఘట్టిదిగా కనిపించింది
మానవత ప్రథమాకారం ప్రేమ కంటె మంచిదిగా తోచింది

ప్రియమైన గుండెలో ముద్రించిన గుర్తులతో
ఎండమావుల్లో నీరు త్రాగడానికి
ఎల్లకాలం ప్రేమ పయనిస్తుంటుంది
మీగడ రంగు పట్టు చీర ఆమె శరీరపు ఒంపుల్ని అనుసరిస్తుంది
బాగా పరిశీలించి చూడు
ఎంత తెలివైందో ఆ దక్షిణ బంగ్లా దొరసాని!
చీర ముడి కనబడనంత సింగారంగా
ఉత్తరపారా, బందేల్, కాశీపూర్, బెహాలా ప్రాంతాల కట్టూ బొట్టూ
కనిపిస్తున్న రెడీమేడ్ లేడీలా వుంది
ఆమె మనో భావాల నెత్తి మూటల్లో ఎవరా కూర్చున్నది.

స్టాలిన్లా, నెహ్రూలా, బ్లాక్‌లా, రాయ్‌లా ?
మనిషికి కావలసిన
ఆరడుగుల నేల కవతల
ఇంకా చోటేమైనా వుంటే
అది త్యాగ భూమి మాత్రం కాదు
ప్రేమ భూమి అసలే కాదు
అనుకుంటూ త్రివేది
ధైర్యం కోల్పోయాడు, దర్పం కోల్పోయాడు
భౌతిక, ఆధ్యాత్మికాలు
చెరో చెవి లాగుతుంటే
ఎటూ కదల్లేక మనిషి బతుకుతుంటాడు
త్రివేది చెవులు మాత్రం, అబ్బా!
తెగలాగేశారు, పాపం!

## విచిత్రాంధకారం

తెల్లటి పగటి కాంతి తెర మీద
గాఢాంధకారం కప్పుకు న్నప్పుడు
అంధులకు మనం లేదనుకునేదే
అన్నిటినీ మించిన దృష్టి!

అప్పుడు జగత్తును పాలించేది
ఆర్ద్రత లేని మనస్సులు
ప్రేమ లేని గుండెలు

తాలిరేని నయ్యాలు, భూతాలు

అప్పుడు వెలుగు మీద విశ్వాసం వుంచి—
ఆరని మానవ జీవిత సత్యాన్వేష జ్వాల మీద
నమ్మకంతో నడిచే వారి గుండెల మీదెక్కి—
కాకులూ గ్రద్దలూ, పొడుస్తుంటాయి
తోడేళ్ళూ, రాబందులు దగ్గరలో నడుస్తుంటాయి.

## మళ్ళీ వస్తాన్నేను

ఎప్పుడో ఒకప్పుడు మళ్ళీ యీ వంగ దేశానికి వస్తాను
ఈ నదీ తీరాన విశ్రమిస్తాను
ఈ వరి పొలాలు పర్యటిస్తాను
బహుశా మనిషిలా రానేమో
పక్షిలా వస్తానేమో!
సస్య పుష్కలమైన సంక్రాంతి రోజుల్లో
పోక చెట్టు కొమ్మకు వ్రేలాడే
మంచు బిందువుల ఉయ్యాల ఊగుతూ
రవి కంటే ముందుగా మేల్కొలిపే
కాకిలా బహుశా వస్తానేమో—

ఎర్రని నా కాళ్ళకు కట్టిన చిరు గజ్జెల మోతలలో
పగలంతా నీటి మీద పవిత్రంగా తేలుతూ

అందమైన అమ్మాయి పెంచుకున్న
పెంపుడు హంసలా వస్తానేమో—

ఎప్పుడో ఒకప్పుడు మళ్ళీ యీ వంగ దేశానికి వస్తాను
ఈ నదుల్ని పలకరిస్తాను
ఈ పొలాల మీద చిరునవ్వులు చిలకరిస్తాను
సాయంత్రపు చల్ల గాలిలో
పావురం ఒకటి నింగిలో పక్షిలు కొడుతుంటుందేమో
పొలంలో పత్తి చెట్టు మీద పిట్టలు కిచకిచ లాడతాయేమో
బహుశా ఒక పసివాడు నా కోసం
పిడికెడు మెతుకులు విసిరెయ్యవచ్చు

రూపసా నది బురద నీటిలో
పిల్లలు కాగితం పడవలు నడుపు తున్నప్పుడు
ఎర్రటి మేఘాల మీదిగా తెల్లటి కొంగలు దిగివస్తున్నప్పుడు
వాటిలో నే నుంటాను
ఎప్పుడో ఒకప్పుడు మళ్ళీ యీ వంగ దేశానికి వస్తాను.

## ఈ రాత్రి...

ఈ రాత్రి నువ్విక్కడికి చేరుకుంటే బావుండేది—
తరు శాఖల నీడల క్రింద
నక్షత్రాల నవ్వుల వెలుగుల్లో
హాయిగా కబుర్లాడుకునేవాళ్ళం

అయినా నాకు తెలుసులే ..
భరతోర్విలో, చైనాలో
అమెరికాలో, లండన్‌లో
ఈ విశాల భూమండలంలో
ఎక్కడైనా ఒకటేలే....

ఆలోచనలూ, అనుభవాలూ,
ఉద్రేకాలూ, ఉబుసు పోక కబుర్లూ
పెట్టిన సరిహద్దుల్లో తిరిగితే
రాత్రి చెప్పే రహస్యాలను
అందంగా ఆవిష్కరించుకోవచ్చు

కాని ...కాని ...
మహామహుల జీవితాలన్నీ
చరిత్ర తయారు చేసిన
ఏదో ఒక మూసలో కరిగి పోవాల్సిందే!

అయితే యిప్పుడు నువ్వెక్కడున్నావు?
చేతిలో ఏ పాచికతో ఆడుతున్నావు?
అయినా అడగడం దేనికిలే!
చేసిన విచారణ అన్నింటిలో సత్యం సిద్ధించింది గనుకనా!

నాకు తెలిసిన ఉదయ సంధ్యల ఉయ్యాలల్లో
మధ్యాహ్నపు మంటల్లో
నదీమతల్లుల నాట్యాల్లో, నక్షత్రాల నవ్వుల్లోనే
విచారించి గ్రహించదగిన దంతా
విచిత్రంగా దాక్కొని వుంది!!

# ముఖ్య గ్రంథ సూచిక

జీవనానంద దాస్ రచనలు......

<u>కవితలు :</u> ఝరాపాలక్ (రాలిన ఈకలు) 1924.

ధూసర్ పాండులిపి (మసలిబ్రాతప్రతి) డి. యం. లైబ్రెరీ, కలకత్తా, 1936.

మహా పృథ్వి. పూర్వస లిమిటెడ్, కలకత్తా, 1944.

సత్-తి-తారర్ తిమిర్ (సప్తర్షి మండలంలో చీకటి) గుప్తా రహమాన్ అండ్ గుప్తా, కలకత్తా, 1948.

వనలతా సేన్, సిగ్నెట్ ప్రెస్. కలకత్తా, 1952.

శ్రేష్ఠ కవిత (ఖండకావ్యం) భారవి, కలకత్తా, 1954.

రూపసి బంగ్లా (అందాల బంగ్లా), సిగ్నెట్ ప్రెస్, కలకత్తా, 1957.

బేలా, అబేలా, కల్ బేలా (కాలం, దుష్టకాలం, కాలాంతం) న్యూ స్క్రిప్ట్, కలకత్తా, 1969.

<u>వ్యాసాలు :</u> కబితార్ కథా (కావ్యజగత్తు) సిగ్నెట్ ప్రెస్, కలకత్తా, 1955.

జీవనానంద దాస్ గురించి......

నిరుక్త మేగజిన్‌లో : సంజయ భట్టాచార్య వ్యాసం, ఆషాఢ 1350 (1943).

పరిచయ్ ,, : సుభాష్ ముఖోపాధ్యాయ వ్యాసం, శ్రావణ, 1360 (1953).

మణీంద్రరాయ్ వ్యాసం, శ్రావణ, 1362 (1955).

మయూఖ్ ,, : జీవనానంద స్మృతి సంచిక 1954.

కవిత ,, : బుద్ధదేవ బోస్ సంపాదకత్వాన జీవనానంద స్మృతి సంచిక పుష్య 1361 (1954) కలకత్తా.

ఉషా ,, : బుద్ధదేవ బోస్ సంపాదకత్వాన జీవనానంద దాస్ ప్రత్యేక సంచిక పుష్య 1361 (1954) కలకత్తా.

ఏకక్ .. : జతీంద్రనాథ్ సేన్ గుప్తా, జె. దాన్‌ల సంయుక్త సంపాదకత్వాన ప్రత్యేక సంచిక, కార్తీక-చైత్ర, 1361 (1954) కలకత్తా

ఆనంద బజార్‌పత్రిక : అజిత్ దత్తా వ్యాసం, 14 కార్తీక 1361 (1954), కలకత్తా.

క్రాంతి మేగజిన్ : నారాయణ గంగోపాధ్యాయ వ్యాసం, కార్తీక 1361 (1954).

ఉత్తరసురి .. : జీవనానంద ప్రత్యేక సంచిక, పుష్య-ఫాల్గుణ 1361 (1954).

అరుణ్ భట్టాచార్య వ్యాసం, వైశాఖ-ఆషాఢ 1363 (1956).

అమలేందు బాసు వ్యాసం, కార్తీక-పుష్య.

అరుణ్ భట్టాచార్య వ్యాసం, కార్తీక-పుష్య 1367 (1960).

కవిత .. : నిరుపమ ఛటోపాధ్యాయ వ్యాసం, ఆశ్వయుజ 1363 (1956).

ఆధునిక బంగ్లా కావ్యపరిచయ్ : దీప్తి త్రిపాఠి వ్యాసం, నవన, కలకత్తా, 1958.

కవితార్ ధర్మా ఓ కవితార్ బుతు బదల్ : అరుణభట్టాచార్య వ్యాసం, జిజ్ఞాస, కలకత్తా, 1958.

కలేర్ పుతుల్ : బుద్ధదేవ్ బోస్ వ్యాసం, న్యూఏజ్ పబ్లిషింగ్, కలకత్తా, 1959.

ఏక్తి నక్షత్ర ఆశే : అమలేందు బాసు పీఠికతో అంబుజ దాస్ రచించిన గ్రంథం, దీపనఫితా పబ్లిషర్స్, కలకత్తా, 1965.

దైనిక్ కవితా : కవితా సిన్హా సంపాదకత్వాన వెలువడిన 25, వైశాఖ్ సంకలనం: జనవరి - ఏప్రిల్ 1968 (జీవనానంద దాస్ భార్యతో లావణ్య దాస్ జరిపిన ఇంటర్వ్యూ) ప్రణవేందు దాస్‌గుప్తా ఎడిట్ చేసినది. మే, 1966.

కవితా పరిచయ్ : 7 వ సంకలనం; సంపాదకుడు అమరేంద్ర చక్రవర్తి. 1966. యిందులో వినయ మజుందార్ రాసిన "అద్భుత్ అంధార్ ఏక్ : జీవనానంద దాస్" అనే వ్యాసం వుంది. 8 వ సంకలనం, యిందులో అశోక్ సర్కార్ రాసిన "ఘోరా : జీవనానంద దాస్" అనే వ్యాసం వుంది. 11 వ సంకలనం మాఘ-చైత్ర 1969. ఇందులో తీర్థంకర ఛటోపాధ్యాయ రాసిన "మృత్యుర్ ఆగే : జీవనానంద దాస్" అనే వ్యాసం వుంది.

ఆధునిక బెంగాలీ

కవిత : సంపాదకుడు దేవీ ప్రసాద్ ఛటోపాధ్యాయ. ఇందులో ప్రధానంగా మార్టిన్ కిర్క్‌మన్ చేసిన అనువాదాలు వున్నాయి. సిగ్నెట్ ప్రెస్, కలకత్తా, 1945.

ఆధునిక బెంగాలీ

కవితా పరిశీలనం : నిర్మల ఘోష్ సంపాదకత్వాన అమలేందు బోస్ రాసిన వ్యాసంతో సహా వెలువడింది. నో వేలా, కలకత్తా, 1968.

జర్నల్ ఆఫ్

ఏషియన స్టడీస్ : న్యూయార్క్‌లోని 'ఆసియా సంఘం' ప్రచురణ ఇందులో జీవనానంద దాస్ కవితలోని భావ చిత్రాలను గురించి మేరీ లాగో రాసిన వ్యాసం వుంది.